# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
**75** పైసలు

సంవత్సర చందా
రూ. **9/-**

# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంత క్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా శాస్త్ర పరిశోధనం వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి ఋజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమంగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలచే దాని పిప్పర మెంట్ లాటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమంగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలల తరబడి వస్తుంది...




...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

DCG.38 TL

అన్నివంటలకు శ్రేష్ఠమైన
నూనెలు




అగ్‌మార్కు కాబడిన
ఎ.యస్. బ్రాండ్..
చాయపప్పు
నూనె




అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......
నువ్వులనూనె

- గోదావరి డెల్టా నువ్వులనుండి ఆరోగ్యకరమగు ప్రత్యేక పద్ధతులతో తయారు కాబడినవి.
- రుచి, రంగు, సువాసనలతో అన్నివంటు పదార్థములను అమితమగు రుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువ యుంచును, ముక్కను మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16, 4, 2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

ఏజెంట్లు :

శ్రీ మాజేటి వీరరాఘవయ్య,
కమీషను మర్చంటు,
శివాలయం వీధి, విజయవాడ

Ms. పెరుమాళ్ళు & కో,
137, అదియప్పనాయక్ స్ట్రీట్,
మదరాసు

Ms. B. V. రావు & కో,
136, పురశువాకం హైరోడ్, మదరాసు

MFRS. అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట









New




by

**THE NATIONAL TRADING CO.**

Manufacturers of

**KASHMIR SNOW BEAUTY AIDS**

BOMBAY-2. MADRAS-32.




# క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా

బోర్న్‌విటా పోషకత్వమునకు సముచితమైనది. కండరములు మరియు టిస్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు, బలము మరియు శక్తి కోసం కార్బొహైడ్రేట్‌లు, ఎముకలను దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్న్‌విటా తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా నుండును!

(CP-579A/2 Tel

# త్వరపడండి! త్వరపడండి!

## చివరి అవకాశం; గెలవండి

# రూ. 10,000 బహుమతులు

రెండు మొదటి బహుమతులు
ఒక్కొక్కటి రూ. 2,500 విలువగలవి
రెండు 2వ బహుమతులు
ఒక్కొక్కటి రూ. 1,000 విలువగలవి
రెండు 3వ బహుమతులు
ఒక్కొక్కటి రూ. 500 విలువగలవి
రెండు 4వ బహుమతులు
ఒక్కొక్కటి రూ. 100 విలువగలవి
36 కాన్సొలేషన్ బహుమతులు
ఒక్కొక్కటి రూ. 50 విలువగలవి

మీ ఉత్తమ ఫోటోను 31 డిసెంబరు, 1967 లోపు పంపించండి.
... అది ప్రక్క వాటిలో ఏదో ఒక బహుమతి మీకు సంపాదించి పెట్టవచ్చు:

Agfa క్లిక్ III




మీ దగ్గర క్లిక్ III ఉంటే, యీ రోజే క్లిక్ చేయడం ప్రారంభించండి. లేకపోతే, వెంటనే క్లిక్ III ఒకటి కొని, యీ గొప్ప ఫోటోల పోటీలో ప్రవేశించండి. ప్రవేశపత్రాలు మీకు దగ్గరలోనున్న అగ్ఫా-గేవర్ట్ డీలరు దగ్గర లభిస్తాయి; లేదా మాకు వ్రాయండి: కాంపెటిషన్ డిపార్ట్‌మెంట్, అగ్ఫా-గేవర్ట్ ఇండియా లిమిటెడ్, కస్తూరి బిల్డింగ్, జె. టాటా రోడ్, బొంబాయి-1.

అగ్ఫా క్లిక్ III-అంతర్జాతీయ ప్రసిద్ధికెక్కిన, విశ్వసనీయమైన కెమెరా. క్లిక్ చటుక్కున పని చేస్తుంది - గుబ్బిపెట్టి నొక్కడమే. అది చాల బోడిమిగలది. 12 పెద్ద (6X6 సెం.మీ.) ఫోటోలు ప్రతి రోలుఫిల్ము మీద తీస్తుంది. అనంత తృప్తికోసం క్లిక్ IIIనే కొనండి. దాని ఖరీదు రూ. 46.50 మాత్రమే. (స్థానిక పన్నులు అదనం)




ఈ రోజే క్లిక్ చేయడం మొదలుపెట్టండి. మీ ప్రవేశ ఫోటోలను 31 డిసెంబరు, 1967 లోపున పంపండి.
అగ్ఫా – గేవర్ట్ ఇండియా లిమిటెడ్, బొంబాయి., న్యూఢిల్లీ . కలకత్తా., మద్రాసు.

CMAG-98-203 TL



## నేను
## డాక్టరును
## కావాలనుకుంటున్నాను

ఆమెను మీరు చదివించితీరాలి.
ఇందుకు డబ్బు కావాలి.
క్రమపద్ధతిని ఆదా చేసుకుంటే
డబ్బు సమకూరుతుంది. సేవింగ్స్
స్కీములోగాని లేదా రికరింగ్
డిపాజిట్ స్కీములోగాని పంజాబ్
నేషనల్ బ్యాంక్‌లో ఖాతా
ప్రారంభించండి. ఆమె కోర్కెను
మీరు తప్పక నెరవేర్చగలరు.

# పంజాబ్ నేషనల్ బ్యాంక్

---

## మీరు మీ చంటి బిడ్డను ముద్దాడునప్పుడు...

మీ చంటి బిడ్డ యొక్క శరీరము, ప్రపంచములోని అన్ని వస్తువులకంటే మృదువైనదిగాను, సున్నితమైనదిగాను యున్నట్లు భావింపరా ?

ముమ్మాటికి అది నిజం! అందుచేతనే మీ చంటి బిడ్డ యొక్క శరీరమునకు, సున్నితమైన, వాత్సల్యమైన బ్రాడోసోల్ యొక్క జాగ్రత్త అవసరమైయున్నది.

ఏంటీ సెప్టిక్స్‌లలోకెల్ల బ్రాడోసోల్ అతి విధేయమైనది. ఇది బినాకా బేబీ పౌడరులో మాత్రమే కలదు. ఇది మీ చంటి బిడ్డ యొక్క మృదువైన శరీరాన్ని, నూగు పొక్కులనుంచి, దురద, చెమట మొదలైన వాటినుంచి కాపాడును.

ఔను, బినాకా బేబీ పౌడరు కూడా చంటి బిడ్డలను ప్రేమించుచున్నది.

మీ చంటి బిడ్డకు బినాకా బేబీ పౌడరును వాడండి. ఆ బిడ్డ సంతోషమును చిరునవ్వును కనిపెట్టండి.

# “అమ్మో బినాకా ఇదిగో”




బాలుకు మామూలుగా తనమిత్రుడు జయవిలాస్ హోటల్ జయరాంతో ఆట్టే కబుర్లేసుకు కూర్చోటమంటే ఇష్టం. ఒకనాడు.......
నేను వెళ్లిరానా, జయరాం. నీ వ్యాపారపు యావలోపడి నన్ను మరిచిపోబోకేం!
బాలూ, పరాచకం ఆడవద్దు! నేను ఉన్నసంగతి చెపుతున్నా, ఈ వ్యాపారం ఒకపెద్ద బెడదగావుండి. కాకపోతే నేనే దీన్ని సరించి పైకి పోక్కటంలేదు.


అదేమిటి, జయరాం, అలా అంటావు?
అవును బాలూ వంటచెరుకు పెద్దసమస్యగావుంది. కట్టెలు, బొగ్గుల ధరలు నానాటికీ పెరిగిపోతున్నవి. నేనూ ధరలు పెంచితే నా వ్యాపారం నడుస్తుందా!


నువ్వు లీకో వాడటం మొదలుపెట్ట లేదనుకుంటా.


లీకోయా? ఇళ్లలోవాడేదాన్ని నువ్వు హోటళ్లకు సిఫారసు చేస్తున్నావా?
అవును, నిశ్చయంగా. నీకు తెలియదా? ఆనల విలాస్ హోటల్ పూర్తిగా లీకో మీదనే ఆధారపడియుంటోంది. లీకో అన్నివిధాలా ఆదెవస్తుంది. దీని వేడి ఎక్కువకాలం నిలిచి యుంటుంది, దీనితో పనికూడ తొందరగా జరుగుతుంది.


నిజంగానా! అయితే నువ్వు తిరిగివచ్చే నాటికి నేను......
....అవును, నువ్వు యిప్పటిలాగ సణుగుతూ వుండవు.

ఆనంద దీపావళి సమయమున
అత్యానందమును చేకూర్చునది

# అశోకా శాండల్‌వుడ్
# ఫేస్ టాల్కు &
# ఆల్ పర్పస్
# పౌడర్సు

పండుగలయందును, శుభకార్యములయందును
చందనము, శుభప్రదమైనది మరి
నిత్యవాడకము
ఘుమఘుమలాడు, పరిమళము చల్లని గుణముగల
ఈ పౌడర్సు అన్ని సమయములలోను ఆనందమును
కలిగించును




విజయా కెమికల్స్
మద్రాసు-7

---

# క్రొత్త టినోపాల్ యొక్క మితవ్యయ ప్యాక్




బాల్చీకి సరిపోయే పొట్లములో
రెగ్యులర్ ప్యాక్‌లో కూడ
లభిస్తోంది.

## సర్వోత్తమ తెలుపుకోసం
## టినోపాల్




® టినోపాల్, జె. ఆర్. గైగి, ఎస్. ఎ. బాల్, స్విజర్లెండ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కు.

సుహృద్ గైగి లిమిటెడ్, బొంబాయి-1.

shilpi SGT 31 A/67 Tel



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

మనుష్యయత్నానికి దైవయత్నం అనుకూలించటంలోనే నిజమైన ఆనందం ఉన్నది. అచ్చుగా దైవాధీనంగా లభించే ఆనందం దక్కదు కూడా. ఈ నీతి "కోరినవరాలు" [బేతాళకథ]లో మనకు స్పష్టంగా తెలుస్తుంది.

"సూర్యకమలం"లో మనం మరొక నీతిని తెలుసుకుంటాం. అందరి ఆశలనూ రేకెత్తించేవి ఉపకారం కన్న అపకారమే చేస్తాయి. అటువంటివి ఎంత మంచివైనాసరే, వాటిని నాశనం చెయ్యటమే క్షేమం.

సంపుటి 41 నవంబర్ '67 సంచిక 5

19

CHITRA



# భారత చరిత్ర




ఈ విధంగా క్లైవు తన స్వశక్తి సామర్థ్యాలతోనే మూడేళ్ళపాటు ఇంగ్లీషు ఆధిపత్యాన్ని బెంగాలులో కొనసాగింపజేసి, 1760 ఫిబ్రవరి 25 న తన దేశానికి వెళ్లిపోయాడు. ఆ వెంటనే నవాబు కొడుకు మీరాన్ అనేవాడు మరణించటంతో, మీర్ జాఫర్ అనంతరం ఎవరు నవాబు అవుతారన్న ప్రశ్న ఏర్పడింది. మీర్ జాఫర్ అప్రయోజకుడూ, అయోగ్యుడూనూ. దానికి తోడు అతను ఇంగ్లీషు కంపెనీకి చెల్లించవలసిన డబ్బు సక్రమంగా చెల్లించలేదు. అందుచేత ఇంగ్లీషువారు నవాబు అల్లుడైన మీర్ కాసిమ్‌ను నవాబు చేయదలిచారు. మీర్ కాసిమ్ వారితో ఒక రహస్య ఒప్పందం చేసుకున్నాడు (1760 సెప్టెంబరు 27). కంపెనీకి ఇంకా రావలిసి ఉన్న మొత్తం చెల్లించటానికీ, బర్ద్వాన్, మిడ్నపూర్, చిటగాంగు జిల్లాలు కంపెనీ పరం చెయ్యటానికీ మీర్ కాసిమ్ సమ్మతించాడు. ఇందుకు ప్రతిఫలంగా ఇంగ్లీషువారు అతన్ని డిప్టీ సుబేదారుగా నియమించటానికీ, కాలక్రమాన అతన్ని నవాబు చెయ్యటానికీ ఒప్పుకున్నారు. అయితే మీర్ కాసిమ్ డిప్టీ సుబేదారుగా ఉండటానికి మీర్ జాఫర్ సమ్మతించలేదు. రాజభవనాన్ని ఇంగ్లీషు సేనలు స్వాధీనం చేసుకునే పరిస్థితి ఏర్పడేసరికి మీర్ జాఫర్ పదవీత్యాగం చేశాడు. వెంటనే మీర్ కాసిమ్ నవాబుగా ప్రకటించబడ్డాడు.

బెంగాలులో ఒక సందిగ్ధ పరిస్థితి ఏర్పడింది. సర్వాధికారాలూ తనవే అయినట్టు నవాబు భావిస్తున్నాడు; అవి తమవే అయినట్టు ఇంగ్లీషువారు ప్రవర్తిస్తున్నారు. కాని ఎవరివన్న విషయం చాలాకాలం నిర్ధారణకాలేదు. చివరకు ఈ విషయం నిష్కర్షగా తేల్చుకునేటందుకు సాహసించి, మీర్ కాసిమ్ తన పీకమీదికే తెచ్చుకున్నాడు.

74. బెంగాలులో ఇంగ్లీషువారి ఆధిపత్యం



ఇంగ్లీషు కంపెనీ ఎలాటి సుంకాలూ చెల్లించకుండా తమ సరకులను బెంగాలులో రవాణా చేసి, వర్తకం సాగించటానికి పాదుషా నుంచి అధికారం పొంది ఉన్నది. అయితే అదే అధికారాన్ని కంపెనీ ఉద్యోగులు తమ సొంత వ్యాపారాలలో కూడా అమలు చేయసాగారు. ఇందు విషయమై నవాబు ఎన్ని పర్యాయాలు తన ఆక్షేపణ తెలిపినా, కౌన్సిలు సభ్యులు స్వలాభాపేక్ష కారణంగా లక్ష్యపెట్టారు కారు.

చివరకు 1762 లో బెంగాలు శాశ్వత గవర్నరయిన వాన్సిటార్ట్, మీర్ కాసిమ్ తన రాజధానిగా కొత్తగా ఏర్పాటు చేసుకున్న మాంఘీరుకు వెళ్ళి ఒక విస్పష్టమైన ఒడంబడిక చేసుకున్నాడు. అయితే కలకత్తాలోని కౌన్సిలు సభ్యు లీ ఒడంబడికను నిరాకరించారు. అప్పుడు నవాబు సుంకాలను పూర్తిగా రద్దు చేసేస్తానన్నాడు. కాని ఇంగ్లీషువారు తమ మీద తప్ప మిగతా వర్తకు లందరి పైనా సుంకాలుండి తీరాలన్నారు. పట్నాలోని ఇంగ్లీషుఫాక్టరీ అధిపతి, ఎలిస్ అనేవాడు, ఇంగ్లీషువారి ప్రత్యేక సౌకర్యాలను గురించి తీవ్రవైఖరి అవలంబించటమేగాక, పట్నానగరాన్ని వశపరుచుకుందామని కూడా యత్నించాడు.



ఈ యత్నం విఫలమై పట్నాలోని ఇంగ్లీషు సైనిక కూటం నాశనమయింది. ఈ సంఘటనల ఫలితంగానే 1763 లో మీర్ కాసిమ్‌కూ, ఇంగ్లీషువారికీ మధ్య యుద్ధం ప్రారంభమయింది.

జూను 10 న మేజర్ ఆడమ్స్ అనే వాడు 1100 మంది తెల్లసైనికులనూ, 4000 సిపాయీలనూ సమకూర్చుకుని యుద్ధరంగంలో మీర్ కాసిమ్‌ను ఎదిరించాడు. నవాబు సైన్యంలో 15000 మంది సైనికులున్నారు; అందరూ పాశ్చాత్య యుద్ధ రీతులలో శిక్షణ పొందినవారే. అయినా మీర్ కాసిమ్‌కు అపజయాల పరంపర తప్పలేదు.



అతను వరుసగా కౌత్వా, ముర్షిదాబాద్, గిరియా, సూతీ, ఉదయనలా, మాంఘీర్ యుద్ధరంగాలలో ఓడిపోయి పట్నాకు పారి పోయాడు. తరవాత అతను తనకు చిక్కిన ఇంగ్లీషు యుద్ధఖైదీలనూ, తన ఉద్యోగులలో అనేకమంది ప్రముఖులనూ హత్య చేయించి, ఔధ్‌కు పారిపోయి, నవాబు షుజాఉద్దౌలాతోనూ, రెండవ షా ఆలమ్ చక్రవర్తితోనూ చేరి, బెంగాలును ఇంగ్లీషు వారి నుండి విముక్తం చెయ్యటాని కొక కూటం ఏర్పాటు చేశాడు.

ఈ సమిష్టి సేనలను 1764 అక్టోబరు 22న బక్సార్ వద్ద ఇంగ్లీషువారు ఓడించారు. వెంటనే షా ఆలమ్ ఇంగ్లీషువారి పక్షం వెళ్ళిపోయి, వారితో విడిగా సంధి చేసుకున్నాడు. మీర్ కాసిమ్ పరారి అయిపోయి, దేశసంచారం చేస్తూ, 1777 లో ఢిల్లీ సమీపంలో దిక్కుమాలిన చావు చచ్చాడు. సిరాజుద్దౌలా కుట్ర ఫలితంగా ఓడాడు, కాని మీర్ కాసిమ్ శక్తి చాలక ఓడాడు. ఈసారి ఇంగ్లీషువారు సాధించిన విజయం వాస్తవమైనది.

ఈ యుద్ధం అయిపోగానే ఇంగ్లీషువారు మీర్ జాఫర్‌ను నవాబుగా ప్రకటించి, అతని నుంచి అదనపు సౌకర్యాలు పొందారు. 1765 లో మీర్ జాఫర్ చనిపోగా, అతని కొడుకు నజ్ముద్దౌలా నవాబు అయాడు. అయితే అతను నామమాత్రపు నవాబు; అధికారమంతా ఇంగ్లీషువారిదే.

1765 మేలో క్లైవ్ రెండోసారి బెంగాలు గవర్నరయి, షా ఆలమ్ చక్రవర్తితో సంధి చేసుకున్నాడు. బెంగాలు, బిహార్, ఒరిస్సాల "దివానీ" ఇంగ్లీషుకంపెనీకి సంక్రమించింది (1765 ఆగస్టు 12). క్లైవు ఇంగ్లీషు కంపెనీలో పెచ్చు పెరిగిన అవినీతినీ, సైనికశాఖలోని దురలవాట్లనూ సరిచేశాడు. అతను 1767 ఫిబ్రవరీలో స్వదేశానికి వెళ్ళిపోయాడు.





# స్వర్గం కొరకు పోటి

ప్రజాపతి భార్యలలో అదితి కుమారులైన దేవతలూ, దితి కుమారులైన దైత్యులూ చిన్నతనం నుంచీ కూడా బద్ధవైరులుగా ఉండి, అస్తమానమూ కొట్లాడుకునేవారు. ఈ రెండు జాతులకూ మధ్య పొత్తుకుదరదని నిశ్చయించుకుని ప్రజాపతి భూలోకానికి ఎగువగా దేవతలకు స్వర్గలోకమూ, దిగువగా దైత్యులకు పాతాళలోకమూ సృష్టించాడు. "మీరంతా ఒకచోట ఉండకండి. ఎవరి లోకాలలో వారు సుఖంగా కాలక్షేపం చేయండి," అని ఆయన తన సంతానానికి చెప్పాడు.

కాని దైత్యులు తమకు స్వర్గమే కావాలని పట్టుబట్టారు. దేవతలు తమకు పాతాళం అక్కర్లేదని ఖండితంగా చెప్పేశారు. ఈ సమస్య పరిష్కారం కావటానికి ప్రజాపతి ఒక మార్గం చెప్పాడు. ఆయన తన బిడ్డలతో ఇలా అన్నాడు:

"దేవతలలో ఒకడూ, దైత్యులలో ఒకడూ భూలోకానికి వెళ్ళి, అక్కడ బతకటానికి ప్రయత్నించండి. ఏ పక్షంవాడు ఎక్కువ విజయం సాధిస్తే ఆ పక్షం వాళ్ళు స్వర్గలోకంలో ఉండండి. రెండోవాళ్ళు పాతాళలోకంలో ఉండండి."

ఇందుకు దేవతలూ, దైత్యులూ కూడా సమ్మతించారు. భూలోకానికి వెళ్ళటానికి గాను దేవతలు తమలో ఒకణ్ణీ, దైత్యులు తమలో ఒకణ్ణీ ఎన్నుకున్నారు. అలా ఎన్నుకోబడిన ఇద్దరినీ ప్రజాపతి భూలోకానికి పంపాడు.

వాళ్ళిద్దరూ భూలోకానికి వచ్చి, మనుషులు ఎలా బతుకుతున్నారో చూశారు.

"ఎట్లా బతుకుదామనుకుంటున్నావు?" అని దైత్యుడు దేవతను అడిగాడు.

"అందరి లాగే శ్రమ చేసి బతుకుదామనుకుంటున్నాను," అన్నాడు దేవత.

సి. రాజశేఖరం



"సరే, నువ్వు శ్రమ చేసి బతుకు. నేను శ్రమ చెయ్యకనే బతుకుతాను," అన్నాడు దైత్యుడు.

ఇద్దరూ కలిసి ఒక భూస్వామి వద్దకు వెళ్ళి, తమ కేదన్నా పని ఇయ్యమని అడిగారు. భూస్వామి ఇద్దరికీ చెరొక నాగలీ, రెండేసి జతల ఎద్దులూ ఇప్పించి, ఒక పెద్ద మడి చూపించి, "ఇదంతా దున్నండి," అని చెప్పాడు.

ఇద్దరూ మడిదున్నటం ప్రారంభించారు. కాని కొద్దిసేపు దున్నినాక దైత్యుడికి విసుగొచ్చింది. అతను తన ఎద్దులను విప్పి, మేయటానికి బీడు మీద వదిలి, తాను వెళ్ళి హాయిగా ఒక చెట్టు నీడన పడుకుని సాయంకాలం దాకా నిద్రపోయాడు.

దైత్యుడు నిద్ర లేచేసరికి చీకటి పడబోతున్నది. మడి అంతా దేవతే పూర్తిగా దున్నేశాడు, ఒక చాలు దున్నవలసి ఉంటే దైత్యుడు దాన్ని పూర్తి చేశాడు. తరవాత ఇద్దరూ భూస్వామి ఇంటికి వెళ్ళారు. భూస్వామి వాళ్ళ కొక చీకటి గది చూపించి, రాత్రికి అందులో పడుకుని మళ్ళీ మర్నాడు కనపడ మన్నాడు.

పగలల్లా శ్రమ పడి అలిసి ఉన్నాడేమో, దేవతకు నడుము వాలుస్తూనే నిద్ర పట్టేసింది. కాని దైత్యుడు పగలల్లా నిద్రపోయి ఉండడం చేత కన్ను మూత పడలేదు. తెల్లవార్లూ మేలుకునే కూర్చున్నాడు.

మర్నాడు తెల్లవారగానే ఇద్దరూ చీకటి కొట్టు నుంచి బయటికి వచ్చారు. దేవత ఒంటి నిండా బంగారపు రజం అంటుకుని ఉండటం దైత్యుడు చూశాడు. దైత్యుడి శరీరానికి బంగార మేమీ అంటుకోలేదు. ఎందుకంటే కిందటి రోజు అతను శ్రమ పడలేదు, అతని శరీరానికి చెమట ఏమీ పట్టలేదు. శరీరమంతా చెమటలు దిగగారేటట్టు శ్రమించిన దేవతకు ఎన్నో తులాల బంగారం అంటుకున్నది.



భూస్వామి వాళ్ళను చూసి, "రాత్రి మీ ఒంటికి అంటుకున్న బంగారం మీరే ఉంచుకోండి. నిన్న మీరు చేసిన పనికి అదే ప్రతిఫలం," అన్నాడు.

దైత్యుడికి చాలా ఆశాభంగమయింది. "ఇవాళ రాత్రి నేను ఈ దేవత కంటె రెట్టింపు బంగారం సంపాదించాలి," అనుకున్నాడతను.

మర్నాడు దున్నటానికి భూస్వామి మరొక మడి చూపించాడు. దేవతా దైత్యుడూ కూడా ఆ మడిని దున్న నారంభించారు. నిన్నటిలాగే దైత్యుడికి కొంచెం సేపయాక విసుగనిపించింది. అతను ఎద్దులను విప్పి బీడు మీదికి తోలి, తాను మళ్ళీ చెట్టు కిందికి వెళ్ళి పడుకుని, చీకటిపడిన దాకా నిద్రపోయాడు.




ఈ రోజు కూడా మడి అంతా దేవతే దున్నాడు. ఇంటికి బయలుదేరే ముందు దైత్యుడు తన వంటినిండా బంక పట్టించుకున్నాడు. వాళ్ళు ఇల్లు చేరగానే భూస్వామి రెండు నీటి తొట్టెలు చూపించి, "వాటిలో మీ ఎడ్లకు నీరు పట్టండి," అన్నాడు. ఒక నీటి తొట్టె దగ్గిరికి దైత్యుడు తన ఎడ్లను తోలితే, రెండో తొట్టె దగ్గిరికి దేవత తన ఎడ్లను తోలాడు. దైత్యుడి ఎడ్లు రోజల్లా పనీ పాటా లేని కారణం చేత రెండు గుక్కల నీరు తాగి ఇవతలికి వచ్చేశాయి. దేవత ఎడ్లు మాత్రం తొట్టెలో నీరంతా పీల్చేశాయి, ఎందుకంటే అవి రోజల్లా పని చేసి బాగా డస్సి ఉన్నాయి.

తొట్టెలో నీరంతా అయిపోగానే అడుగున ఉన్న బంగారం బయటపడింది. "అదే నీ కూలి, తీసుకో," అన్నాడు భూస్వామి దేవతతో.

"నా కూలి మాటేమిటి?" అన్నాడు దైత్యుడు.

"నీ ఎద్దులు శ్రమించి, తొట్టెలో నీరంతా తాగితే నీ కూలి నీ తొట్టెలోనూ దొరికేది.

కాని, ఎద్దులూ శ్రమించలేదు, నువ్వూ శ్రమించలేదు, నేనేం చేసేది?" అన్నాడు భూస్వామి.

ఇదంతా గమనిస్తున్న దేవతలు, "మావాడే గెలిచాడు. స్వర్గం మాదే," అన్నారు.

దైత్యులు అందుకు ఒప్పుకోలేదు.

"భూలోకంలో భూమి దున్నటం ఒకటే బ్రతుకుతెరువు కాదు. ఆ లోకంలో విస్తీర్ణమైన సముద్రాలున్నాయి. సముద్రం మీద బతకటానికి కూడా పోటీ జరగవలిసిందే!" అన్నారు, దైత్యులు.

ప్రజాపతి భూలోకం నుంచి తన బిడ్డలిద్దరినీ పిలిచి, "మీ రిద్దరూ సముద్రం మీద పడవలలో వెళ్ళి చేపలు పట్టండి. ఎవరు హెచ్చు చేపలు పట్టితే వాళ్ళది స్వర్గం. రెండో వాళ్ళది పాతాళం," అన్నాడు.

దేవతా దైత్యుడూ చెరొక పడవలోనూ ఎక్కి, చెరొక వలా తీసుకుని, సముద్రం మీద చేపల వేటకు బయలుదేరారు.

ఈసారి పోటీలో తమ వాడు గెలవగలం దులకు దైత్యులు వంచన అవలంబించ నిశ్చయించారు. వాళ్ళు చాలామంది సముద్రంలో ప్రవేశించి, తమ ప్రతినిధి అయిన దైత్యుడి వల నిండా చేపలను కుక్క నారంభించసాగారు.

దేవత తన వలను పైకి లాగే సరికి దానిలో బోలెడన్ని చేపలున్నాయి. అదే సమయానికి దైత్యుడు తన వలను కూడా పైకి లాగేసరికి, అందులో అంతకు పదింతలు చేపలున్నాయి. ఆ కారణంగా వల నీటి పైకి వస్తూనే చేపల బరువుకు తట్టుకోలేక చిరిగిపోయింది; అందులోని చేపలన్నీ మళ్ళీ సముద్రంలో పడిపోయాయి.

ఏ విధంగానూ దైత్యులు దేవతలను పోటీలో ఓడించలేక పోయారు. అందుచేత స్వర్గం దేవతల నివాసస్థానమయింది. దైత్యులు పాతాళంలో నివాసం ఏర్పాటు చేసుకున్నారు.





# పాతాళదుర్గం

## 19

[సూర్యోదయం కాగానే, మాంత్రికుడి అనుచరులు పాతాళదుర్గం మీదికి ఓషధీభస్మాలు ప్రయోగించారు. రాక్షసులు దాని ప్రభావం వల్లా, తాగినమైకంలోనూ కవ్వించుకుని, తన్నుకోసాగారు. మహాకలి ఏనుగుల రథం మీద అక్కడికి వచ్చాడు. విరూపుడు వదిలిన నల్లగరుడపక్షి, బంగారు మొసలిపిల్లతో పాతాళదుర్గం మీద ఎగరసాగింది. తరవాత—]

రాక్షసులు నల్ల గరుడపక్షిని చూసి అద్భుతం చెంది ప్రాణాచారాలు పడటం గమనించిన మహాకలి, ఏనుగల రథం ఆపి తలఎత్తి పైకి చూశాడు. అతడి దృష్టిని గరుడపక్షి కాలిన వేలాడుతున్న మొసలిపిల్ల ఆకర్షించింది. పక్షిలో విశేషం ఏమీలేదు. అలాంటి వాటిని అతడు లోగడ తూర్పువైపు కొండ ప్రాంతాల్లో చూసి వున్నాడు. కాని, బంగారంలా మిల మిలా మెరిసిపోతున్న మొసలిపిల్ల పక్షి కాలిన వేళ్ళాడు తుండటం ఏమిటి? బంగారు మొసళ్ళు ఎక్కడైనా వుంటవా?

తమ రాజు వాలకం గమనించిన ఒక ముసలిరాక్షసుడు, "మహాకలీ! ఆ పక్షి నీ తండ్రి అయిన ఘోరకలి అని మనవాళ్ళు భక్తితో దణ్ణాలు పెడుతున్నారు. నీవూ అలా చేయటం బావుంటుంది. లేకపోతే, తండ్రి అంటే భక్తిగౌరవాల్లేని కొడుకుగా వాళ్ళు నిన్ను దూషిస్తారు," అని సలహా యిచ్చాడు.



"గరుడపక్షి నా తండ్రి ఎలా అవుతుంది? ఇందులో ఏదో మోసం వున్నది. వారం రోజులుగా దుర్గం చుట్టూవున్న కొండల మీద మానవాధము లెవరో తచ్చాడు తున్నట్టు యింతకు ముందే నాకు వార్త తెలిసింది," అన్నాడు మహాకలి కోపంగా.

మహాకలి అన్న మాటల్ని ముసలి రాక్షసుడు అందరికీ వినబడేలా ఎత్తయిన రాతి బండ మీద నిలబడి, పెద్ద గొంతుతో చెప్ప సాగాడు: "అది కొండ శిఖరాల మీద బతికే గుడ్డి గరుడపక్షి, మహాసత్వుడైన ఘోర కలేశ్వరుడు కాదు. ఈ మాట మన దుర్గేంద్రుడు మహాకలి చెపుతున్నాడు."

ఈ మాటలు విన్న రాక్షసుల్లో కొందరు గరుడపక్షి కేసి రాళ్ళు గురిచేశారు, మరి కొందరు, ముసలివాడు తమ రాజును అవమానిస్తున్నాడన్న కోపంలో అతడి మీదికి చేతికందిన ఆయుధాలను విసరసాగారు. మహాకలి తన అంగరక్షకు లందర్నీ కేకవేసి, వాళ్ళతో సంప్రతింపులు ప్రారంభించాడు.

పైన కొండ మీది చెట్లచాటున నిలబడి యిదంతా చూస్తున్న కాలశంబర మాంత్రికుడు తృప్తిగా ఓ సారి నవ్వి, "సరోవరంలో వున్న బండరాయిని మనవాళ్ళు యీపాటికి బయిటికిలాగి వుంటారు. గుహల్లో వున్న మన వాళ్ళంతా యింకా కొండమీదికి వచ్చినట్టు లేదే? జై, శాంభవీ! వేగిరం, వేగిరం!" అంటూ మంత్రదండాన్ని పైకెత్తి గిరికీలు కొట్టసాగాడు.

అంతలో భూకంపం కలిగినట్టుగా కొండ దద్దరిల్లిపోయింది. పాతాళదుర్గం వైపున వున్న కొండపాదంలో రెండుమూడు చోట్ల నీరు తాటిచెట్టు ప్రమాణంలో పైకి లేచి, చెవులు చిల్లులుపడేలా ధ్వనిస్తూ దుర్గం ముందున్న మైదానం మీద ధారాపాతంగా పడసాగింది.

"జలప్రళయం! జలప్రళయం!" అంటూ కొందరు రాక్షసులు భయంతో



కంపించిపోతూ కేకలు పెట్టారు. ముసలి రాక్షసుడు గొంతు మరింత పెద్దది చేసి, "తనను అవమానించినందుకు ఘోర కలేశ్వరుడు మనందరినీ శిక్షిస్తున్నాడు. రాక్షసజాతి సర్వనాశనం తప్పదు. దీనికి బాధ్యతంతా మహాకలిదే!" అని అరిచాడు.

సరోవరంలోని బండరాయిని మోకుల సాయంతో బయటికి లాగిన మాంత్రికుడి అనుచరులు—భద్రుడూ మొదలైనవాళ్ళు పరుగు పరుగున అతడి దగ్గిరకు వచ్చారు. భద్రుడు ఎంతో ఉత్సాహంగా, "మహా మాంత్రికా! మనం జయించాం. ఇంత కాలంగా నువ్వు రహస్యంగా దాచివుంచిన బండరాయిని బయటికి గుంజగానే, సరోవరం అంతా ఒక్కసారి అల్లకల్లోలమై, భూకంపం వచ్చినట్టుగా కొండ గజగజలాడి పోయింది," అన్నాడు.

"అది భూకంపమా? కాదు, ప్రళయం, మహాప్రళయం! నేను రోజుల తరబడి జలస్తంభనం చేసి, సరోవరం అడుగు నుంచి కొండలోని సొరంగాల్లోకి దారులు ఏర్పరిచి, కావాలన్నప్పుడు సరోవర జలమంతా పాతాళదుర్గాన్ని ముంచెత్తేందుకు వీలుగా ఆ రాయిని అక్కడ తాపడం చేశాను. ఆ రాయికి ఏ కారణం వల్లనైనా




స్థానభ్రష్టత్వం కలిగిందో, పాతాళదుర్గం నీట మునుగుతుంది. కాని, రాక్షసుల్లో కొందరైనా యీ లోపల దుర్గాన్నుంచి అరణ్యంలోకి వున్న కొండదారి వెంట పారిపోయే అవకాశం వున్నది. ఆ దుర్మార్గుల్లో ఒక్కగా నొక్కడైనా అలా ప్రాణాలతో బయటపడకుండా వుండేందుకే, యింత కాలం వేచివుండి, యిన్ని ఏర్పాట్లు చేయవలసి వచ్చింది," అంటూ కాలశంబరుడు, చెవులకు అరచేతు లడ్డం పెట్టుకుని కొంచెం సేపు విని, "ఏమిటా అరుపులు? మీకు వినబడటం లేదా?" అని పక్క నున్న వాళ్ళను ప్రశ్నించాడు.



29




"ఎక్కడో దూరంగా పులులూ, సింహాలూ రెచ్చిపోయి మొరుగుతున్నట్టుగా వున్నది," అన్నాడు విరూపుడు.

"మొరగటమా?" అంటూ మాంత్రికుడు చిరునవ్వు నవ్వి, "అవి కుంభీరుడి పెంపుడు జంతువులు. ఒకటి రెండు రోజులుగా వాటికి ఆహారం పెట్టకుండా మాడ్చాడు. ఇప్పుడవి పాతాళదుర్గం నుంచి అరణ్యంలోకి పోయేందుకున్న ఇకే ఒక సన్నని కొండమార్గాన్ని కాపాడేందుకు వస్తున్నవి. ఆ దారి వెంట మహాకలి తన అనుచరులతో బయటికి పారిపోలేడు. సాహసించి మన వైపుగా వున్న కొండ ఎక్క

దలిస్తే మనం వాళ్ళను హతమారుస్తాం. ఆ క్రూరులందరూ నీట మునిగి చావవలిసిందే," అన్నాడు.

"శశికాంతుణ్ణీ, రాజకుమారి కాంతిసేననూ వెంట తీసుకుని సరోవర ప్రాంతానికి బయలుదేరిన కుంభీరు డేమయ్యాడో తెలియటం లేదు," అన్నాడు భద్రుడు.

"నా మిత్రుడూ శత్రువూ కూడా అయిన పులిందుడి పడుచు పెళ్ళాం భామాసింగి కూడా వాళ్ళ వెంట వున్నదని చెప్పావు. ఆ గయ్యాళి అందర్నీ తప్పు దారి పట్టించి వుంటదు గదా?" అన్నాడు విరూపుడు.

"మా కన్నిటికన్న రాజకుమారి ముఖ్యం. ఆమెను తెచ్చి రాణీగా చేస్తామని మా కదంబ ప్రజలందరికీ మాట యిచ్చి వచ్చాం," అన్నాడు ధూమకుడు. సోమకుడు అవునన్నట్టు తలాడించి, విల్లంబుల్ని చేతికి తీసుకున్నాడు.

కాలశంబర మాంత్రికుడు అసంతృప్తి సూచకంగా తల పక్కకు తిప్పుకుని, "ఇప్పుడు ఎవరి ప్రయోజనం వాళ్ళు చూసుకోవటం ప్రారంభిస్తే మొదటికే ముప్పు వస్తుంది. నా తండ్రిని క్రూరాతిక్రూరంగా తల నరికి చంపిన మహాకలి రాక్షసుణ్ణి హతమార్చితే నా పగ తీరినట్టే! కాని,



అంతమాత్రాన కలగబోయే మేలేముంటుంది? వాడి అనుచరుల్లో మరొకడు పాతాళదుర్గాన్ని ఆశ్రయంగా పెట్టుకుని, మహాకలిని మించిన ఘోరకార్యాలు చేయవచ్చు. కనక, ముందీ రాక్షసాధములందర్నీ యమపురికి పంపితే, ఆ తరవాత రాజకుమారి కాంతిసేనా, మంత్రికొడుకు శశికాంతుడూ—అందరి రక్షణా చూడవచ్చు," అన్నాడు.

ఆ మాటలకు భద్రుడూ, ధూమకుడూ ఒకేసారి గొంతెత్తి ఏదో జవాబు చెప్పబోయేంతలో కింద పాతాళదుర్గం వైపు నుంచి భయంకరమైన ధ్వని వినబడింది. మాంత్రికుడూ అతడి అనుచరులూ కొంచెం ముందుకు పరిగెత్తి రాళ్ళ మీదుగా వంగి, కిందికి చూశారు. పాతాళదుర్గంలోని ఒక భాగం నీటి తాకిడికి పునాదులతో కూడా కదిలి నీట పడిపోయింది. అప్పటి వరకూ దాని మీద నిలబడివున్న రాక్షసులు హాహాకారాలు చేస్తూ నీళ్ళల్లో పడి ఈదసాగారు. కొందరు రొప్పుతూ రోజుతూ మాంత్రికుడున్న కొండ వైపుకు యీదుకు రావటం కనబడింది.

కాలశంబరుడు మంత్రదండం పైకెత్తి, "భద్రా! ధూమకా! నా మాట కొంచెం వినండి. శశికాంతుడూ, రాకుమారీ క్షేమంగా






వున్నారని నమ్మండి," అంటూ మంత్ర దండాన్ని వాళ్ళ ముందుకు చాచి, "ఇదుగో, ఆ చెట్టు కింద కనబడుతున్నారు గదా? ఆ పక్కన వున్నవాడు కుంభీరుడు!" అంటూ వాళ్ళు మంత్రదండం కేసి దృష్టి తిప్పక ముందే చప్పున పైకెత్తి పట్టుకుని, "భద్రా! చెట్లకొమ్మల్లో భద్రంగా దాచి వుంచిన రాకాసి వడిశెలలను, రాక్షసాధముల మీద ప్రయోగించటానికి యిదే మంచి అదను. గురి చూసి, వాళ్ళ మీదికి రాతి గుండ్లను విసరండి," అని చెప్పాడు.

భద్రుడు చప్పట్లు చరిచి, కొండ గుహల నుంచి పైకి వచ్చిన మాంత్రికుడి అనుచ



రుల్ని కొందరిని వెంట పెట్టుకుని, కొండ అంచున వున్న మహావృక్షాల దిక్కు కేసి పరుగుతీశాడు.

ఆ సరికే చెట్ల మీద వున్న వడిశెలల వాళ్ళు, పెద్ద పెద్ద రాతిగుండ్లను వాటిల్లో పెట్టి రాక్షసుల మీద ప్రయోగించటానికి సిద్ధపడి, అజ్ఞల కోసం ఎదురుచూస్తున్నారు.

భద్రుడు వాళ్ళను సమీపించి, "ఇక రాళ్ళవర్షం కురిపించండి. దెబ్బ కొక రాక్షసుడు పరలోకానికి ప్రయాణం కట్టాలి," అని హెచ్చరించి, తన వెంట వున్నవాళ్ళతో, "మీరు మోయగలిగినంత పెద్ద రాళ్ళను వడిశెలల వాళ్ళ దగ్గిరకు తీసుకుపొండి," అని అజ్ఞాపించాడు.

ఒక్క క్షణం తరవాత మహా వృక్షాల కొమ్మల నున్న వడిశెలల నుంచి పెద్ద పెద్ద రాళ్ళు జుఁయ్ అని శబ్దం చేస్తూ, నీట యీదుతున్న రాక్షసుల శరీరాలను తాక సాగినై. దెబ్బ తగలగానే ఒక్కొక్క రాక్షసుడూ పెద్ద చావుకేక పెట్టి నీట మునిగి గిలగిలా తన్నుకుంటూ పైకి తేలసాగాడు.

ఆ సరికి పాతాళదుర్గంలో ఎక్కువ భాగాన్ని సరోవర జలం ఆక్రమించింది. దుర్గం తాలూకు కొన్ని శిఖరాలు మాత్రమే నీటి మీద తేలివున్నవి. కొందరు రాక్షసులు





ఆ శిఖరాలను ఆసరాగా పట్టుకుని వేళ్ళాడుతున్నారు. కింద పొంగులు వారుతున్న నీటిని చూసిన బంగారు మొసలిపిల్ల అందులో దూకేందుకు గిజగిజ తన్నుకో సాగింది. ఆ కారణం వల్ల నల్ల గరుడపక్షి ఎంత బలంగా రెక్క లాడించినా ఎత్తుకు పోలేక, వరద నీటికి నాలుగైదు గజాల ఎత్తున ఎగరసాగింది.

"ఘోరకలేంద్రుడు మనను రక్షించేందుకు వస్తున్నాడు!" అంటూ పాతాళదుర్గం శిఖరం పట్టుకు వేళ్ళాడుతున్న ఒక రాక్షసుడు కేక వేశాడు. ఆ వెంటనే చాలా మంది రాక్షసులు, "రక్షించు, ఘోర కలేంద్రా, రక్షించు!" అంటూ హాహాకారాలు ప్రారంభించారు.

ఇదంతా చూస్తున్న కాలశంబర మాంత్రికుడు పొట్ట చెక్కలయేలా నవ్వుతూ, "విరూపా! నీ నల్ల గరుడుడు నువ్వన్నట్టు నిజంగా దేవతాపక్షే. దాని సాయంతో మనం రాక్షసుల్ని బాగా మోసగించగలిగాం. కాని, మహాకలి ఏమైనట్టు? వాడు జలగండం నుంచి తప్పించుకు పోలేదు గదా?" అన్నాడు, అదుర్దా కనబరుస్తూ.

అందరూ పరవళ్ళు తీస్తున్న నీటి కేసి పరీక్షగా చూశారు. హఠాత్తుగా రెండు ఏనుగులు పాతాళదుర్గ శిఖరం వెనక నుంచి ముందుకు వచ్చినై. వాటిల్లో ఒక దాని మీద మహాకలి వున్నాడు, రెండవ దాని మీద అతడి అంగరక్షకు లిద్దరు కూర్చుని వున్నారు. అందరి దుస్తులూ నీళ్ళోడుతున్నవి. మహాకలి తన చేతిలోని గదను పైకెత్తి, "ఆ దిక్కుమాలిన పక్షి, నా తండ్రి అనుకుని ప్రాణాచారాలు పడి, నెత్తి మీది కొస్తున్న ప్రమాదాన్ని గుర్తించక చిక్కుల్లో పడ్డాం. ఇప్పుడు విచారించి లాభం లేదు. అందరూ అరణ్యంలోకి పోయే కొండ సారంగం కేసి యీదుకురండి. కొండ మీదికి చేరాలని ప్రయత్నించే వాళ్ళను, ఆ దుష్ట








మాంత్రిక వెధవ కాలశంబరు డెలా రాళ్ళు విసిరి చంపిస్తున్నాడో కనబడటం లేదా ?" అంటూ పెద్దగా అరవసాగాడు.

మహాకలి అంగరక్షకు లిద్దరూ తాము ఎక్కి వున్న ఏనుగును చక్రాకారంలో వరద నీట తిప్పుతూ, రాక్షసులను శూలాలతో పొడిచి మహాకలి చెప్పిన కొండ సారంగం కేసి మళ్ళవేయసాగారు. మహాకలి అటు కేసి ఏనుగును నడుపుతూ, "తొందరగా రండి! సారంగం దాటి ఒకసారి నేల తాకామో, ఆ మాంత్రికుడు చచ్చిన వాడి కిందే లెక్క. నా కాబొయ్యే పెళ్ళాం కాంతి సేన ఎక్కడ? బలిపెట్టవలసిన ఆ చచ్చు వెధవ శశికాంతు డేమయ్యాడు? పిశాచి భామానింగి నీటి కలిసిందా? అ( అన్నటు కుంభీరుడేడీ? ఆ ఒంటికొమ్ము రాహు వంశపు శుంఠే గదా వాళ్ళందరికీ కాపలా? కుంభీరా! కుంభీరా!" అంటూ కేకలు పెట్టసాగాడు.

"మహాకలిగాడికి మతిపోయింది! సంధి మంత్రాని కిదా సమయం? సరే, అందరూ కొండ సారంగం కేసి నడవండి. ఈ సరికే అక్కడ కుంభీరుడు వన్యమృగాలతో ద్వారరక్షణ చేస్తూ వుంటాడు. అయినా, రాక్షసులకు సింహాలతో పోట్లాడటం ఏపాటి? మనం కాట్ల కుక్కలతో కలియబడ్డంత తేలిక," అంటూ కాలశంబరుడు వేగంగా బయలుదేరాడు.

రాక్షసులందరూ తమ రాజు వెనకగా యీదుతూ సారంగ మార్గం కేసి రాసాగారు. మాంత్రికుడు తన అనుచరలతో కొండ రాళ్ళు ఎక్కి దిగుతూ, సాధ్యమైన చోట కొండ అంచుల వెంట పాకుతూ, వాళ్ళ కన్న కొంచెం ముందుగా సారంగ మార్గం చేరాడు. అతడికి అరణ్యం వైపుకు వున్న సారంగద్వారం ముందు కుంభీరుడూ, అతడి వంశం వాళ్ళూ కనిపించారు.

—[వచ్చే సంచికలో ముగింపు]





# కోరినవరాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీవు ఏ సత్ఫలితం కోరి ఇలా ప్రయాసపడుతున్నావో నాకు తెలియదుగాని, వెనకటికి హయగ్రీవుడి లాగా గొప్ప ఫలితాలను పోగొట్టుకుని కొద్ది ఫలితం మాత్రమే దక్కకుండా ఉండేలాగు చూసుకో. శ్రమ తెలియకుండా ఉండగలందులకు నీకు హయగ్రీవుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

ఒకప్పుడు మహావతీ నదీతీరప్రాంతంలో హయగ్రీవు డనే యువకుడు ఒక చిన్న చెరువు కింద కొద్దిపాటి పొలం పండించుకుంటూ జీవిస్తూ ఉండేవాడు. కొన్ని ఏళ్ళపాటు వ్యవసాయం బాగానే సాగింది గాని, అందుకు ఆధారంగా ఉంటున్న చెరువు

## బేతాళ కథలు



క్రమంగా ఎండిపో నారంభించింది. ఇందు వల్ల హయగ్రీవుడు చాలా నష్టపోయాడు. వ్యవసాయం బొత్తిగా గిట్టుబాటు కాకపోయే సరికి, అతను పొట్టపోసుకోవటానికి అరణ్యం మీద ఆధారపడవలసి వచ్చింది. అడవిలో వేటాడదగిన మృగాలుండేవి. వాటి మాంసం విక్రయించి నాలుగు డబ్బులు తెచ్చుకునే వాడు. అడవిలో పళ్ళూ, ఫలాలూ దొరికేవి. తేనె దొరికేది. వీటి మీద ఆధారపడి జీవ యాత్ర గడపవలిసిన దుస్థితి హయగ్రీవుడికి ఏర్పడింది.

ఒకనాడు అతను అడవిలో తిరుగుతూ ఉండగా ఒక చోట ఒక ముని తపస్సు చేసుకుంటూ కనిపించాడు. హయగ్రీవుడు ఆ చుట్టుపట్ల ఉండే పళ్ళూ, కంద మూలాలూ, తేనే తెచ్చి, ముని ముందు పెట్టి, సాష్టాంగపడ్డాడు. ముని అతని కాను కలు స్వీకరించి, అతన్ని ఆశీర్వదించాడు.

అది మొదలు హయగ్రీవుడు రోజూ కొన్ని పళ్ళూ, తేనే సంపాదించి ఆ మునికి సమర్పించి, తరవాత తన పని తాను చూసు కుంటూ వచ్చాడు. ఇలా కొద్ది రోజులు గడి చాక ఆ ముని హయగ్రీవుడితో, "నాయనా, ఇవాళ పూర్ణిమ. ఈ రోజు నీ వేదన్నా కోరు కున్నట్టయితే నీ కోరికను తీర్చే శక్తి నాకు ఉన్నది. అందుచేత నీ స్థితికి తగిన కోరిక ఏదన్నా ఒకటి కోరుకో," అన్నాడు.

దారిద్ర్యబాధ తప్ప మరే బాధా లేని హయగ్రీవుడు, "స్వామీ, నాకు వెయ్యి బంగారు కాసులుంటే, ఈ జీవితానికి ఏ లోటూ లేకుండా సుఖంగా బతకగలను. సాధ్యమైతే అవి నాకు ఇప్పించండి," అని వేడుకున్నాడు.

"అలాగే ఇచ్చాను, ఇంటికి వెళ్ళి చూసుకో!" అన్నాడు ముని.

హయగ్రీవుడు ఇంటికి వెళ్ళి చూసు కుంటే అతని బిందె నిండా బంగారు కాసులు కనిపించాయి. ఆ ధనం చూసుకుని

అతను ఎంతో మురిసిపోయాడు. ఆ ముని ఎంత ప్రతిభగలవాడో, ఎంత దయగలవాడో తలుచుకుంటే అతనికి అంతులేని భక్తి పుట్టుకొచ్చింది. అందుచేత అతని కిప్పుడు అరణ్యంలో ఏమీ పనిలేకపోయినా, పాలూ, ఫలాలూ తీసుకుని రోజూ అరణ్యానికి పోయి, మునికి నివేదన చేసి, ఆయనకు తన కృతజ్ఞత తెలుపుకుంటూ వచ్చాడు.

గర్భదరిద్రుడుగా ఉండగా హయగ్రీవుణ్ణి పలకరించినవారు లేకపోయారు గాని, అతని దగ్గిర అంతులేని ధనం చేరినట్టు తెలియగానే ఊళ్ళో అందరూ అతనికి ఆప్తులయారు. అందరూ అతని మంచి కోరినవారే!

"ఈ ఇంట్లో ఉండే కర్మ నీ కేమిటి? మంచి ఇల్లు కట్టుకో, మంచి బట్టలు కట్టుకో, సుఖంగా ఇంత తిని పదిమందికీ పెట్టు. ఖర్చుగాని ధనం వెంట ఉన్నా ఒకటే, నట్టేట ఉన్నా ఒకటే. ఘనంగా బతుకుతున్నావంటే గొప్ప ఇంటివాళ్ళు నీకు పిల్లనిచ్చి పెళ్ళి చేస్తారు. నీ స్థాయి అన్నివిధాలా పెరుగుతుంది," అని ఈ ధోరణిలో వాళ్ళు హయగ్రీవుడికి సలహాలిచ్చి అతనిచేత డబ్బు ఎడాపెడా ఖర్చు పెట్టించసాగారు.

నెల తిరిగింది. హయగ్రీవుడు రోజూ అరణ్యానికి వెళ్ళి మునికి కానుకలు సమర్పించుకుంటూనే ఉన్నాడు. ఒక





రోజున మళ్ళీ ముని అతనితో, "నాయనా, ఇవాళ పూర్ణిమ. నీ కేదైనా కోరిక ఉంటే చెప్పు, నేను తీర్చగలను," అన్నాడు.

"స్వామీ, తమ దయ వల్ల నా దారిద్ర్య బాధ తీరింది. మంచి కన్యను పెళ్ళాడి సంసారసౌఖ్యం కూడా రుచిచూద్దామని ఉన్నది. మంచి అందమూ, శుభలక్షణాలూ గల కన్య నాకు భార్యగా లభ్యమయేటట్టు అనుగ్రహించినట్టయితే నేను మీకు ఎంతో కృతజ్ఞుణ్ణి అయి ఉంటాను," అన్నాడు హయగ్రీవుడు.

"అలాగే. నాయనా. నీవు ఇంటికి వెళ్ళే దారిలో, ఈ అరణ్యంలోనే నువు కోరిన కన్య కనిపిస్తుంది. ఆమెను తీసుకుపోయి పెళ్లి చేసుకో," అన్నాడు ముని.

ముని చెప్పినట్టే హయగ్రీవుడు తిరిగి వచ్చే దారిలో ఒక చెట్టు కింద ఒక అపురూప సుందరి నిలబడి ఉన్నది. హయగ్రీవు డామెను పలకరించి, "ఎవరు నువు? నీ వాళ్ళెవరు? ఇక్కడ ఎందుకు నిలబడి ఉన్నావు?" అని ప్రశ్నించాడు.

"నా కేమీ తెలీదు," అన్నదామె.

"అయితే నా వెంట వచ్చి, నన్ను పెళ్లి చేసుకుంటావా?" అని హయగ్రీవు డడిగాడు. అందు కామె సమ్మతించింది. అత నామెను తెచ్చి పెళ్లి చేసుకుని కొంతకాలం పాటు సుఖంగా గడిపాడు.

దాదాపు నెల గడిచింది. ఒక్కసారిగా హయగ్రీవుడికి రెండు విపత్తులు సంప్రాప్త మయాయి. అతని భార్యకు ఏదో జబ్బు చేసి, ఎన్ని మందులకూ లొంగక, చివరకు ఆమె మరణానికి దారి తీసింది. అదే సమయంలో దొంగలు పడి అతని దగ్గిర మిగిలి ఉన్న బంగార మంతా ఎత్తుకుపోయారు.

హతాశుడై హయగ్రీవుడు అరణ్యంలోని ముని వద్దకు వెళ్ళి తనకు కలిగిన నష్టాలు చెప్పుకుని, "స్వామీ, మీరు నా మీద ఎంతో అనుగ్రహంతో నాకు రెండు అపూర్వమైన

వరాలిచ్చారు. కాని రెంటినీ పోగొట్టుకుని, మళ్ళీ యథాస్థితికి వచ్చాను. ఈ లోటు మీరే పూర్తి చెయ్యాలి," అన్నాడు.

ముని తల ఆడించి, "ఇవాళ పూర్ణిమ. నీకు కావలిస్తే ఈ రోజు నీవు కోరిన కోరిక తీర్చగలను. అందుకు ఇదే ఆఖరు అవకాశం. ఎందుచేతనంటే, ఇక్కడ నా తపస్సు ముగిసింది, రేపు నేను హిమాలయాలకు వెళ్ళిపోతున్నాను. నీకు మరి కనిపించను," అన్నాడు.

"అలా అయితే నాకు మళ్ళీ ధనాన్నీ, మరొక భార్యనూ దయచేయించండి. కొత్త వరం కోరను," అన్నాడు హయగ్రీవుడు.

"ఏదైనా ఒక్క వరమే కోరుకో, నాయనా. జ్ఞాపకం ఉంచుకో, ఇదే నేను తీర్చగల నీ చివరి వరం," అన్నాడు ముని.

హయగ్రీవుడు కొంతసేపు ఆలోచించి, "అలా అయితే, నా చేను నానుకుని ఉన్న చెరువులో తీయకుండా నీరుండేటట్టు అనుగ్రహించండి, స్వామీ," అన్నాడు.

"అలాగే ఉంటుంది," అన్నాడు ముని.

మర్నాడు హయగ్రీవుడు తన పొలానికి వెళ్ళి చూస్తే, ఎండిపోయిన చెరువు నిండా నీరున్నది. హయగ్రీవుడు వెంటనే పొలం దున్ని, దానికి పుష్కలంగా నీరు పెట్టి, పంట వేశాడు. పొలం బాగా పండింది. నీటి



కరువు తీరి పోవటం చేత, హయగ్రీవుడు ఆ కాస్త పొలంలోనే పంటలు మార్చి మార్చి పండించి, డబ్బు వెనకవేసి, త్వరలోనే కాస్త స్థితిపరుడైనాడు. అతనికి చాలామంది పిల్ల నిస్తామని ముందుకు వచ్చారు. హయగ్రీవు డొక అందమైన పిల్లను పెళ్ళాడి, ఆమె వల్ల పిల్లలను కని, సుఖంగా బతికాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక సందేహం. తనకు ధనమూ, భార్యా తప్ప ఇంకేమీ అవసరం లేదన్న హయగ్రీవుడు, ఏదో ఒకటే కోరమని ముని అన్నప్పుడు, ఆ రెంటిలో ఏదో ఒకటి కోరక, మూడోది ఎందుకు కోరాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "హయగ్రీవుడు మూడోసారి తెలివిగానే వరం కోరాడు. అతను ధనంవల్లా, భార్యవల్లా సుఖం ఎరిగి ఉన్నవాడు కావటం చేత మొదట కొత్తవరం ఏమీ కోరక ఆ రెంటినే తిరిగి కోరాడు. కాని ముని తనకు ఒక్కవరం మాత్రమే ఇవ్వ గలడని తెలిసినప్పుడు అతను ఆలోచించ వలిసి వచ్చింది. ధన దారలలో ఏ ఒకటీ తనకు తృప్తి కలిగించదు. పైగా రెండూ నిలిచేవి కావు. ఆ సంగతి అతనికి అనుభవం ద్వారా తెలిసి వచ్చినదే. వాటికన్న భూమి శాశ్వతమైనది. వ్యవసాయం తన చేతిలో ఉన్న విద్య. అతనికి లేనిదల్లా నీరు. చెరువులో నీరున్నంత కాలమూ అతను వ్యవసాయం చేసుకుని తృప్తిగా బతికినవాడే. అందుచేత తన చేతిలో లేని సుఖం కన్న తన చేతిలో ఉన్న తృప్తి కోసం హయగ్రీవుడు చెరువులో నీరుండాలని కోరాడు. అతని సుఖానికి అదే మూలాధారమయింది కూడా," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)






# సూర్యకమలం

ప్రభావతీనగరాన్ని పాలించే విశ్వావసు డనే రాజుకు జితేంద్రియుడూ, పరాక్రముడూ, శత్రుజిత్తూ, ధవళకీర్తీ అని నలుగురు కొడుకులుండేవారు. అందరూ సమమైన పరాక్రమాలు కలవారు. తండ్రికి ఆ నలుగురియందూ సమమైన ప్రేమ ఉండేది. వారిలో ఒకడు మాత్రమే తన అనంతరం రాజవుతాడనేది ఆయనకు బాధగా ఉండేది. అందుచేత ఆయన తన తరవాత రాజయేవాణ్ణి ఎన్నటానికి ఒక ఆలోచన చేశాడు.

విశ్వావసుడి తాతముత్తాతల కాలంలో రాజభవనంలో ఒక సూర్యకమలం ఉండేది. అది స్వయం ప్రకాశం గలది. అది ప్రభావతీ నగరంలో ఉండినంత కాలమూ కరువు కాటకాలూ, ఈతిబాధలూ లేక ప్రజలు సుఖంగా బతికారు. కాని కొంతకాలానికి ఆ సూర్యకమలాన్ని చోరు లెవరో అపహరించారు. అది ప్రస్తుతం ఎక్కడ ఉన్నదీ స్పష్టంగా తెలియదు. అది ఇక్కడ ఉన్నదనీ, అక్కడ ఉన్నదనీ గాలికబుర్లు అప్పుడప్పుడూ వస్తూనే ఉన్నాయి. ఏనాడో పోయిన ఆ సూర్యకమలాన్ని తన కొడుకులలో ఎవరు సంపాదించుకు వస్తే వాడికే రాజ్యాధికారం ఇద్దామని రాజు విశ్వావసుడు నిశ్చయించాడు.

తమ తండ్రి ఉద్దేశం తెలుసుకుని రాజకుమారులు మంచి ముహూర్తాన నాలుగు దిక్కులకూ ప్రయాణమయారు.

జితేంద్రియుడు తూర్పుగా బయలుదేరాడు. అతను దారిలో తగిలినవారిని సూర్యకమలం గురించి అడిగాడు. కొందరు సముద్రవర్తకుల ద్వారా అతనికా కమలం తూర్పు దీవులలో ఒకదానిలో ఉన్నట్టు తెలిసింది. అతను ఓడ ఎక్కి సముద్రాన్ని దాటి ఒక దీవికి వెళ్ళాడు. ఆ దీవిలో అతను అడుగుపెట్టిన నాడే ఒక ఏనుగు

డి. సుబ్రహ్మణ్యం



వెనకగా జనం గుంపులు గుంపులుగా వచ్చారు. ఆ ఏనుగు తన తొండంతో పట్టుకుని ఉన్న మాలను జితేంద్రియుడి మెడలో వేసింది. తాను రెండు దీవులకు రాజైనట్టు అతను తెలుసుకున్నాడు.

ఇలా ఎందుకు జరిగినదీ అతనికి క్రమంగా తెలియవచ్చింది. అతను అడుగు పెట్టిన దీవిలో ఉండే రాజుకు ఎవరో ఒక వర్తకుడు కొంతకాలం క్రితం ఒక ప్రకాశవంతమైన కమలాన్ని అమ్మాడు. అది వచ్చినది మొదలు నిజంగానే ఆ దేశం సుభిక్షంగా ఉన్నది. ఇది చూసి పొరుగున ఉండే దీవిలోని రాజుకు కన్నుకుట్టింది. ఆ కమలాన్ని ఎలాగైనా కాజెయ్యాలనుకుని తన వేగులవాళ్ళను పంపాడు. పొరుగు రాజు తన మీద యుద్ధప్రయత్నాలు చేస్తున్నట్టు ఇక్కడి రాజుకు తెలిసింది. ఈయన కూడా ఆ రాజ్యానికి వేగులవాళ్లను పంపాడు. యుద్ధమైతే జరగలేదు గాని, ఒక దేశపు రాజవంశాన్ని మరొక దేశపు వేగులవాళ్ళు విషప్రయోగంతో చంపటం జరిగింది. రెండు రాజ్యాలలోనూ సంక్షోభం చెలరేగింది. ఈ సంక్షోభంలో ఎవరో సూర్యకమలాన్ని ఎత్తుకుపోయారు.

ఇంత జరిగాక ఉభయ దేశాల ప్రజలూ ఏకమై తమ కొక రాజును ఎన్నుకుని ప్రశాంతంగా కాలం గడప నిశ్చయించుకున్నారు. ఒక మంచిరోజు చూసి ఆ దేశపు పట్టపు టేనుగుకు దండ ఇచ్చి దాన్ని స్వేచ్ఛగా వదిలారు. అది ఆ దండను జితేంద్రియుడి మెడలో వేసింది.

సూర్యకమలం వల్ల కలిగిన మేలేమిటో జితేంద్రియు డెరగడు గాని, దాని మూలంగా జరిగిన భీభత్సం గురించి విన్నాక అతనికి ఆ కమలాన్ని సంపాదించాలన్న కోరిక పూర్తిగా నశించింది. అదీగాక తనకు రెండు రాజ్యాలు ఒక్కసారిగా లభించాయి. అందుచేత అతను సుఖంగా రాజ్యం ఏలుకోవ

టానికి నిశ్చయించాడు. అతను తనకు కలిగిన రాజ్యప్రాప్తి గురించి తండ్రికి తెలుపుతూ, తాను సూర్యకమలాన్ని వెతికే పని నుంచి విరమించుకున్నట్టు కూడా దూతల ద్వారా కబురు చేశాడు.

రెండవ రాజకుమారుడైన పరాక్రముడు పడమటగా బయలుదేరాడు. ఎన్ని దేశాలు దాటి వెళ్ళినా అతనికి సూర్యకమలం గురించి ఎలాటి వార్తా తెలియరాలేదు. కాని అతను కోవిదారనగరానికి వచ్చేసరికి అక్కడ రాజకుమార్తె యొక్క స్వయంవరం జరగబోతున్నది. స్వయంవరానికి ఏ రాజకుమారుడైనా వెళ్ళవచ్చు. నానా దేశాల రాజకుమారులు చేరే చోట సూర్యకమలం వార్త తెలిసే అవకాశం కూడా ఉన్నది. అందుచేత పరాక్రముడు తాను కూడా స్వయంవరానికి వెళ్ళి తన వంశమూ, దేశమూ, పేరూ తెలుపుకుని అందరితో బాటు కూర్చున్నాడు. రాజకుమార్తె రాజకుమారు లందరినీ చూసుకుంటూ వచ్చి, పరాక్రముణ్ణి చూడగానే ఆగి, అతని మెడలో మాల వేసింది.

రాజూ, మంత్రీ, స్వయంవరానికి వచ్చిన రాజకుమారులూ అతన్ని అభినందించారు. పెళ్ళి వైభవంగా జరిగింది. కోవిదార



రాజుకు మగపిల్లలు లేరు, ఒక్కతే కుమార్తె. ఆమెను పెళ్ళాడినవాడు రాజవుతాడు. ఆ ఆశతోనే అంతమంది రాజకుమారులు స్వయంవరానికి వచ్చారు. తలవని తలంపుగా కోవిదారరాజ్యం తనకు సంప్రాప్తమయే సరికి పరాక్రముడుకి సూర్యకమలాన్ని వెతకాలన్న అభిలాష పోయింది. అదీగాక తాను వచ్చిన దిశలో సూర్యకమలం జాడ ఏ మాత్రమూ తెలియరాదు. కనుక అది తన మిగిలిన సోదరులలో ఎవరికో ఒకరికి దొరుకుతుందని పరాక్రముడు మనస్సును సమాధానపరుచుకున్నాడు. అతను కూడా దూతల ద్వారా



తన అనుభవాలు తండ్రికి తెలియబరచి, తాను సూర్యకమలాన్ని వెతికే ప్రయత్నం మానుకున్నానని కబురుచేశాడు.

దక్షిణదిశగా బయలుదేరిన మూడోవాడు శత్రుజిత్తు సూర్యకమలం గురించి వాకబు చేస్తూ సముద్రతీరందాకా వెళ్ళాడు. దక్షిణ ప్రాంతంలో చాలాకాలం క్రితం ఉండేదనీ, దాన్ని ఏనాడో దొంగలు ఎత్తుకుపోయారనీ, ఇటీవల దాన్ని గురించి వార్తలే లేవనీ శత వృద్ధులు కొందరతనికి చెప్పారు. శత్రు జిత్తు ఇంటికి తిరిగివెళ్ళిపోక, సముద్రతీరం వెంబడే పడమటి దేశాలకు వెళ్ళాడు. అక్కడ తన అన్న అయిన పరాక్రము డున్నట్టు తెలిసి, వెళ్ళి అతన్ని చూశాడు. పరాక్రముడు సూర్యకమలం కోసం వెతికే పని కట్టిపెట్టి, చక్కని రాజకుమార్తెను పెళ్ళాడి, ముందు ముందు రాజు కాబోతు న్నాడు. శత్రుజిత్తు తన అన్నను అభినం దించి, ఉత్తరంగా బయలుదేరాడు.

అతను కొంతదూరం వెళ్ళేసరికి ఒక చోట చిన్నకొండ కనిపించింది. అది మామూలు కొండలాగా లేదు. దగ్గిరికి వెళ్ళి చూస్తే అది బంగారపు కొండ. దాని రాళ్ళలో సగానికి సగమైనా బంగారం ఉండి ఉండాలి. శత్రుజిత్తు ఆ కొండ కేసి వింతగా చూస్తూ నిలబడి ఉండగా అతన్ని ఎవరో పట్టుకోబోయినట్టనిపించింది. శత్రు జిత్తు ఆ పట్టు విడిపించుకుని పక్కకు గెంతి, వెనక్కు తిరిగి చూస్తే ఎవరూ కని పించలేదు. ఎవరో అదృశ్య వ్యక్తి తనకు సమీపంలో మసలుతున్నట్టు గ్రహించి, అతను చప్పున కత్తి దూసి గాలిని బలంగా నరికాడు. మరుక్షణం పెద్ద ఆర్తనాదం వినిపించింది. రెండు ఖండాలై నేల మీద పడిన ఒక రాక్షసదేహం అతనికి కన బడింది. రాక్షసుడి తల నుంచి ఒక ఘుటిక జారి కింద పడింది. అది ఆ రాక్షసుడు ధరించిన అదృశ్య ఘుటిక.

రాక్షసుడు చావగానే దూరాన ఉన్న చెట్లతోపుల నుంచి వేలాది జనం పరిగెత్తుకుంటూ వచ్చి, అతన్ని చుట్టుముట్టి, "మహారాజుకు జై!" అని అరిచారు.

"మీరంతా ఎవరు? నన్నెందుకు మహారాజని పిలుస్తున్నారు?" అని శత్రుజిత్తు వాళ్ళ నడిగాడు. వాళ్ళు తమ కథ చెప్పారు.

వాళ్ళంతా ఆ సమీపంలో ఉన్న సువర్ణకోశనగరం నుంచి వచ్చినవాళ్ళు. వాళ్ళకున్న సంపద ఈ బంగారు కొండ మాత్రమే. కాని ఈ కొండ వద్ద ఎవడో రాక్షసుడు చేరాడు. వాడు అదృశ్యంగా నగరంలోకి వచ్చి తన ఇష్టం వచ్చినవాళ్ళనల్లా చంపి తిన్నాడు. ఒకరోజు రాజుగారినే చంపేశాడు. ఒక్కొక్కప్పుడు ఎవరైనా బంగారు కొండ కేసి జనం వస్తే, రాక్షసుడు వాళ్ళను చంపి తినేసి, ఆ రోజుకు నగరం చాయలకు వచ్చేవాడు కాడు. అందుచేత నగరంలో వాళ్ళకు, ఆ రాక్షసుడు ఆ కొండ సమీపంలోనే ఉంటాడని తెలిసిపోయింది. ఎవరైనా ఆ కొండ ప్రాంతాలకు పోతారేమోనని వాళ్ళు వెయ్యికళ్ళతో చూసేవారు. కొండ చాయలకు ఎవరూరాని రోజున వాళ్ళు చీకటి పడకముందే ఇళ్ళలో దూరి, తలుపులు గట్టిగా మూసుకుని,




ప్రాణాలు అరచేత పట్టి రోజుల తరబడి బయటికి వచ్చేవారు కారు. రాక్షసుడు ఎవరినైనా చంపి తిన్నట్టు తెలిశాక తలుపులు తెరిచి, గబగబా తమ పనులు చూసుకునేవాళ్ళు. ఈ రాక్షసుడి మూలాన వాళ్ళకు జీవితం నరకమయింది. అటువంటి రాక్షసుణ్ణి శత్రుజిత్తు చంపేశాడు. అందుచేత వాళ్ళు అతన్ని తమకు రాజును చేసుకున్నారు.

తరగని బంగారమూ, రాజ్యమూ చేజిక్కగానే శత్రుజిత్తుకు సూర్యకమలాన్ని వెతకాలన్న కోరిక పూర్తిగా పోయింది. అదీగాక ఉత్తరదిక్కుగా అతని తమ్ముడు



కీర్తి గనక సరిపోయింది గాని, అతని అన్నలలో ఎవరు వెళ్ళినా ఈపాటికి విసిగి, వెనక్కు తిరిగిపోయేవారే.

సూర్యకమలాన్ని తరుచు దొంగలు ఎత్తుకు పోతూంటారని ధవళకీర్తి చాలా మంది నోట విన్నాడు. దాన్ని దొంగిలించే వాడు ఒక అదృశ్య రాక్షసుడనీ, వాడు సువర్ణకోశం అనే నగరంలో ఉంటాడనీ, సూర్యకమలం ఆ రాక్షసుడి దగ్గిరే ఉన్నదనీ ధవళకీర్తికి ఎవరో చెప్పారు. అది నిజమో కాదో తేల్చుకునేటందుకు అతను సువర్ణకోశాన్ని వెతుక్కుంటూ వచ్చాడు. వచ్చిచూస్తే తన మూడో అన్న రాజ్యాభిషేకం చేసుకుంటున్నాడు. సూర్యకమలాన్ని దొంగిలించాడన్న అదృశ్య రాక్షసుడు ఆ అన్న చేతనే చచ్చాడు. కాని సూర్యకమలం జాడమటుకు లేదు.

"ఇంకెక్కడి సూర్యకమలం రా, తమ్ముడూ? నువు కూడా హాయిగా ఒక రాజ్యం సంపాదించి, నాలాగే సుఖపడు," అని శత్రుజిత్తు తన తమ్ముడికి సలహా ఇచ్చాడు. అయితే ధవళకీర్తి అందుకు ఒప్పుకోక, తాను సూర్యకమలాన్ని సాధించి తీరవలిసిందే నన్నాడు. తన అన్నలు ముగ్గురూ ఆ పని నుంచి విరమించినట్టు ధవళకీర్తి వెళ్ళే వున్నాడు. సూర్యకమలం ఉత్తర దిక్కున ఉండాలేగాని, అతను సంపాదించలేకపోడు. అందరిలోకీ అతనే పట్టుదల కలవాడు.

ధవళకీర్తి ప్రయాణం తన అన్నల ప్రయాణంలాగా చురుకుగా సాగలేదు. దానికి ఒక కారణం, ఉత్తరం వెళ్ళినకొద్దీ దేశం చాలా విశాలంగా ఉన్నది. దానికి తోడు అతనికి సూర్యకమలం గురించి వార్తలు విరివిగా దొరుకుతూ వచ్చాయి. వాటిలో చాలా భాగం కట్టు కథలు కావటం చేత అతని కాలం చాలావరకు వృథా అయింది. ఉత్తరంగా వెళ్ళినవాడు ధవళ

అతనికి తెలిసింది. అందుచేత సూర్యకమలాన్ని సాధించే పనికి తానే పూనుకున్నాడు.

"అట్లా అయితే ఈ అదృశ్యఘుటిక నీకు ఉపయోగపడవచ్చు, దగ్గిర ఉంచుకో," అని శత్రుజిత్తు ధవళకీర్తికి రాక్షసుడి అదృశ్యఘుటిక నిచ్చాడు. ధవళకీర్తి దాన్ని తీసుకుని కొన్నాళ్ళు ప్రయాణించిన మీదట అతనికి సూర్యకమలం గురించి రూఢి అయిన వార్త ఒకటి చాలామంది నోట వినపడింది. అదేమిటంటే, సూర్యకమలం ఒకటి సుధావర్తదేశంలో ఉన్నది.

అయితే ధవళకీర్తి అక్కడికి చేరేసరికి అతనికి ఒక చాటింపు వినపడింది. అంతకు పూర్వమే ఎవరో సూర్యకమలాన్ని తస్కరించారు; దాన్ని తిరిగి సంపాదించినవాడికి తన కుమార్తె నిచ్చి పెళ్ళిచేస్తానని సుధావర్తదేశపు రాజు చాటింపు వేయిస్తున్నాడు.

ఎంతో ఆశతో వచ్చిన ధవళకీర్తి ఈ మాట విని మొదట హతాశుడైపోయాడు. కాని అంతలోనే అతని పట్టుదల జయించింది. దొంగతనం ఎప్పుడు జరిగింది? సూర్యకమలం ఎక్కడ ఉండగా దొంగలు ఎత్తుకుపోయారు? వాళ్ళు అక్కడికి ఎవరి సహాయమూ లేకుండా ఎలా రాగలిగారు? ఇటువంటి అనుమానాలు ఎన్నో అతనికి



కలిగాయి. ఈ సందేహాలన్నీ తీరితేనే గాని దొంగలను పట్టుకోవటం సాధ్యంకాదు.

నగరంలో ఎంత మందిని ప్రశ్నించినా, "మా కా వివరాలేవీ తెలీదు," అన్నారు.

ధవళకీర్తి తిన్నగా సుధావర్త దేశపు రాజు వద్దకు వెళ్ళి, ప్రశ్నించాడు.

రాజు ఒక్క ప్రశ్నకూ సమాధానం చెప్పకపోగా, ధవళకీర్తిని అనుమానంగా చూసి, "సూర్యకమలాన్ని దొంగిలించిన ముఠాలోవాడివి లాగున్నావే?" అన్నాడు.

"మీ చాటింపు ప్రకారం సూర్యకమలాన్ని సాధించదలచిన వాడెవడైనా ఈ ప్రశ్నలు అడిగి తీరుతాడు. ఆ మాట



అటుంచి, మా తాతల ముత్తాతల కాలంలో సూర్యకమలం మాదే. నేను దాన్ని తిరిగి సంపాదించుకునేటందుకే మా దేశం విడిచి ఇంతదూరం వచ్చాను. అంతే గాని మీ అమ్మాయిని పెళ్ళాడటానికి రాలేదు," అన్నాడు ధవళకీర్తి రోషంగా

"అలా అయితే నేను నీకు అసలేమీ చెప్పను. నీ వంటివాడు సూర్యకమలాన్ని దొంగల నుంచి కాపాడితే మాత్రం నాకేం లాభం?" అన్నాడు రాజు.

ధవళకీర్తి అదృశ్యఘుటిక సహాయంతో రాజభవనంలో చాలారోజులు గడిపి అందరి రహస్య సంభాషణలూ విన్నాడు. అతనికి ఎన్నో రహస్యాలు తెలిశాయి గాని సూర్యకమలం పోయిన పద్ధతి మాత్రం తెలియరాలేదు. రాజభవనంలో ఎవరూ సూర్యకమలం గురించి మాట్లాడుకోవటం లేదు.

ధవళకీర్తి అదృశ్యంగానే అరణ్యంలో దొంగలమూఠా లుండే చోట్లను కూడా వెతుక్కుంటూ తిరగటానికి వెళ్ళాడు. ఒకచోట అతని కొక ముని తపస్సు చేసుకుంటూ కనిపించాడు. ఆ ముని తన దివ్యదృష్టితో తనకేమైనా సలహా ఇస్తాడేమో, దగ్గిరికి వెళ్లి ముని ఎదటపడి అడుగుదామా అనుకుంటుండగా అరణ్యంలో ఈలలు వినిపించాయి. ముని ఆ ఈలలకు జవాబుగా తాను కూడా ఈలవేశాడు.

మరుక్షణం నలుగురైదుగురు మనుషులు ముని వద్దకు వచ్చారు. చూడటానికి వాళ్ళు దొంగల్లాగున్నారు. అదృశ్యంగా ఉన్న ధవళకీర్తి వాళ్ళకు దగ్గిరగా వెళ్ళి వాళ్ళ సంభాషణ విన్నాడు.

"ఈ నెల రోజుల్లో నగరం కేసి దొంగలమూఠా లేవీ వచ్చినట్టు లేదు, దొరా," అన్నా డొక దొంగ మునితో.

"అసలు దొంగతనం జరిగిందా, లేదా అని అనుమానంగా ఉంది, దొరా," అన్నాడు మరొకడు.

"సూర్యకమలాన్ని దొంగిలిస్తే మన ముఠా దొంగిలించాలిగాని, మరెవరికి సాధ్య మవుతుంది?" అన్నాడు మూడోవాడు.

ముని కాస్సేపు ఆలోచించి, "సూర్య కమలాన్ని ఎవరూ దొంగిలించలేదు. మనని వంచించటానికి రాజు పెద్ద ఎత్తు వేశాడు. సూర్యకమలాన్ని దొంగ లెత్తుకు పోయా రంటే మనం ఇక ఆ రాజుగారింటి చాయ లకు వెళ్ళం—అదొక లాభం. మనలో మనం ఒకరి నొకరు అనుమానించుకుని కొట్టుకు చస్తాం—అది రాజుకు రెండో లాభం! సూర్యకమలాన్ని రాజే ఎక్కడో దాచాడు. రాజభవనంలో ఇక మనకు చారులు కూడా దొరకరు—అది రాజుకు మూడో లాభం," అన్నాడు.

దొంగలకు పట్టరాని కోపావేశం వచ్చింది. రాజును చంపుదామనీ, కొరత వేద్దామనీ, రాజభవనానికి నిప్పు పెడదామనీ, వాళ్ళు ఏమేమో పేలారు. ముని వేషంలో ఉన్న దొంగల నాయకుడు వాళ్ళను తొందరపడ వద్దనీ, రాజును మోసం చేసేటందుకు తానే ఏదో యుక్తి ఆలోచిస్తాననీ చెప్పాడు.

ధవళకీర్తి ఇక అక్కడ నిలవలేదు. అతను తిన్నగా రాజభవనానికి వచ్చి, "రాజా, నీ కుమార్తెను నా కిచ్చి పెళ్ళి



చెయ్యి. నీ సూర్యకమలం జాడ తెలి సింది," అన్నాడు.

రాజు అతని కేసి అనుమానంగా చూసి, "జాడ తెలిసి ఏం లాభం? నువు దాన్ని నా కివ్వాలి గద!" అన్నాడు.

"అది నీ దగ్గిరే ఉన్నది. నీ కుమార్తె నిస్తావో, సూర్యకమలాన్ని ఇస్తావో చప్పున తేల్చుకో!" అంటూ ధవళకీర్తి కత్తి దూసి, దాని మొన రాజు గుండెకు ఆనించాడు.

'నన్ను చంపకు. కావలిస్తే నీకు సూర్య కమలాన్నీ, నా కూతురినీ కూడా ఇస్తాను. కాని నేను బ్రహ్మభేద్యమైన ఎత్తు వేసి దొంగల కళ్ళలో కారం చల్లాను. నా ఎత్తంతా

భగ్నం చేసేశావు. ఆ సూర్యకమలాన్ని నాకు దక్కకుండా చేశావే గాని, నువ్వూ దక్కించుకోలేవు," అన్నాడు రాజు.

ధవళకీర్తి నవ్వి, "దొంగలు నీ కన్నా, నా కన్నా కూడా తెలివైనవాళ్ళే. అది నీదగ్గిరే ఉన్న సంగతి దొంగల మూలానే నాకూ తెలిసింది. అది తిరిగి దొంగల చేత పడటం మాటా? అది నేను జరగనివ్వను. నీకా భయం వద్దు," అన్నాడు ధవళకీర్తి.

రాజు ధవళకీర్తికీ, తన కుమార్తెకూ పెళ్ళి ఏర్పాటు చేసి, సూర్యకమలాన్ని అల్లుడికి కానుకగా ఇచ్చాడు. ఆ సూర్యకమలాన్ని ఒడిలో పెట్టుకున్న ధవళకీర్తి ఏదో మంత్రం చదువుతూ దాన్ని హోమాగ్నిలో వేసేశాడు.

రాజు, "అయ్యో, అయ్యో!" అని లబలబలాడాడు.

"మహారాజా, ఈ సూర్యకమలం ఎన్ని రాజ్యాలకు అనర్థం తెచ్చిందో తెలుసుకుంటే దీని కోసం విచారించరు. ఈ సూర్యకమలం ఉన్న దేశాలు సుభిక్షంగా ఉన్నాయన్న దానికి ప్రబల సాక్ష్యం లేదు. దీని మూలంగా అనేక దారుణాలూ, రక్తపాతాలూ జరిగాయనటానికి బోలెడంత సాక్ష్యం ఉన్నది. దీన్ని గురించి నాకు తెలిసినంతగా ప్రపంచంలో మరెవ్వరికీ తెలియదు. చాలాకాలంగా నేను దీని కోసం వెతుకుతున్నది దీన్ని నాశనం చెయ్యటానికే. మీరిక నిశ్చింతగా ఉండండి," అన్నాడు ధవళకీర్తి.

అతను రాజకుమార్తెను పెళ్ళాడి, ఆమెతో సహా తన దేశానికి తిరిగి పోయి, తన తండ్రికి జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పి, సూర్యకమలాన్ని శాశ్వతంగా నాశనం చేసినందుకు తండ్రి ప్రశంసలు పొంది, తండ్రి రాజ్యానికి తానే వారసుడై, తండ్రి అనంతరం తానే రాజై చాలాకాలం సుఖంగా రాజ్యపాలన చేశాడు.





# గురూపదేశాలు

ఒక నగరంలో గురుకులం ఉండేది. అనేక గ్రామాల నుంచి విద్యార్థులు వచ్చి అక్కడ విద్యాభ్యాసం చేస్తూ ఉండేవారు. వారిలో ఒకే గ్రామం నుంచి వచ్చిన విద్యార్థులు ముగ్గురుండే వారు. వాళ్ళు ఉగాదిపండుగకు గ్రామం పోదలిచి గురువుగారిని సెలవు కోరారు.

"అలాగే వెళ్ళిరండి. కాని, వృథా ప్రసంగాలు చెయ్యకండి. మాటలు మాణిక్యాలని జ్ఞాపకం ఉంచుకోండి. నేర్చుకున్న పాఠాలు మరిచిపోకండి," అని హితబోధ చేసి, గురువుగారు వాళ్ళను ఆశీర్వదించి పంపేశాడు.

వృథాప్రసంగాలు వద్దని గురువుగారు చెప్పినందు వల్ల వాళ్ళు మౌనంగా దారిన నడవసాగారు.

ఆ వూరి రాజుకు మారువేషంలో నగర సంచారం చేసే అలవాటున్నది. ఆయన సామాన్య దుస్తులు ధరించి నడుస్తూ ఈ ముగ్గురు విద్యార్థులనూ చూశాడు. సాధారణంగా ఇద్దరు కుర్రవాళ్ళు కలిసి వెళ్ళినా ఏవో కబుర్లు చెప్పుకుంటూ పోతారు గాని, మౌనంగా నడవరు. వీళ్ళు ముగ్గురుండి కూడా మాటా పలుకూ లేకుండా మౌనంగా ఎందుకు నడుస్తున్నారో రాజుకు అంతుబట్టలేదు. ఈ రహస్యమేమిటో తెలుసుకుందామని ఆయన వాళ్ళను కలుసుకుని, "అబ్బాయిలూ, మీరు ముగ్గురూ మౌనవ్రతం పట్టినట్టుగా, మాటా పలుకూ లేకుండా ఎందుకు నడుస్తున్నారు?" అని అడిగాడు.

"అయ్యా, మాటలు మాణిక్యాలు. మేము వ్యర్థసంభాషణ చెయ్యం," అన్నాడు ఒక విద్యార్థి.

ఆ మాటకు రాజు తనలో తాను నవ్వుకుని, "అయితే, తలా ఒక మాణిక్యమూ

పి. గోపాలరత్నం



ఇస్తాను, తలా ఒక మాటా మాట్లాడతారా?" అని అడిగాడు.

కుర్రాళ్ళు సమ్మతించినట్టు తల లూపారు. రాజు తన బట్టల లోపలి నుంచి మూడు మాణిక్యాలు తీసి ముగ్గురికీ ఇచ్చి, "ఏదీ? తలా ఒక మాటా మాణిక్యం లాటిది అనండి!" అన్నాడు.

"అపాయం ఉన్నచోట అజాగ్రత్త పనికి రాదు," అన్నాడు ఒక విద్యార్థి.

"పగవాడికైనా పాలే పొయ్య," అన్నాడు రెండోవాడు.

"మూర్ఖుడికి దండమే ఔషధం," అన్నాడు మూడోవాడు.

ఇంటికి పోతూ పెద్ద శ్రమేమీలేకుండా తలా ఒక మాణిక్యాన్ని సంపాదించు కున్నందుకు సంబరపడుతూ విద్యార్థులు తమ దారిన పోయారు.

రాజు కూడా వాళ్ళు చెప్పిన మాటలను అప్పుడే మరిచిపోయి త్వరత్వరగా రాజ భవనానికి వెళ్ళిపోయాడు.

ఆయన ఇంటికి చేరేసరికి ఆస్థాన జ్యోతి ష్కుడు ఆయన కోసం వేచి ఉన్నాడు. ప్రతి ఉదయమూ రహస్య మందిరంలో కూర్చుని, తనకు ఆ రోజు కలగబోయే ఫలి తాలను జ్యోతిష్కుడి చేత చెప్పించు కోవటం రాజుకు అలవాటు. జ్యోతిష్కుడు అన్ని విషయాలూ దాపరికం లేకుండా మాట్లాడతాడు గనక ఆయన మాటలను మరెవ్వరూ వినరాదు.

రహస్య మందిరంలోకి చేరాక జ్యోతి ష్కుడు రాజుతో, "ఇవాళ పగలంతా మీకు సుఖంగా గడిచిపోతుంది, కాని ఈ రాత్రికి మీకు విషగండం ఉన్నది. ప్రాణభయంలాంటిదేమీ లేదు గాని, గండం మటుకు అలా కనిపించిపోతుంది," అని చెప్పాడు.

ప్రాణభయం లేదని జ్యోతిష్కుడు చెప్పిన మీదట రాజు గండం గురించి

ఏ నాడూ లక్ష్య పెట్టలేదు. రాజుకు ఎన్నో గండాలు గడిచాయి. అయితే ఈ సారి, "అపాయం ఉన్నచోట అజాగ్రత్త పనికి రాదు," అని విద్యార్థి చెప్పిన మాట రాజుకు జ్ఞాపకం వచ్చింది. అందుచేత ఆయన ఈ రాత్రి చాలా జాగ్రత్తగా ఉండ నిశ్చయించాడు. ఎవరైనా విషప్రయోగం చేస్తారేమో నని ఆయన ఆ రాత్రి భోజనం చెయ్యలేదు. తెల్లవార్లూ జాగరం ఉండి, ఏ రూపంలో గండం వచ్చేదీ చూడాలని నిశ్చయించుకున్నాడు.

ఆయన ఆ రాత్రి రాణి వద్దకు వెళ్ళక తాను విశ్రాంతి తీసుకునే గదికే వెళ్ళాడు. రాజుగారు భోజనం కూడా చెయ్యలేదు గదా అని, వంటవాడు ఒక పళ్ళెంలో పళ్ళూ, ఒక లోటాతో పాలూ తెచ్చి గదిలో పెట్టి వెళ్ళిపోయాడు. రాజు వాటిని కూడా తీసుకోలేదు.

గదిలో దీపం దేదీప్యమానంగా వెలుగుతున్నది. రాజు తన శయ్యమీద మేలుకుని కూర్చుని ఉన్నాడు.

ఒక రాత్రివేళ ఒక తాచుపాము కిటికీ కుండా గదిలోకి రావటం రాజు కంట పడింది. తనకు గండం పాామురూపంలో దర్శనం కావలిసి ఉన్నదన్న మాట! దాన్ని తన కత్తితో నరికి, సుఖంగా పడు



కుని నిద్రపోదామని రాజుకు చప్పున ఆలోచన వచ్చింది. కాని అంతలోనే, ఇంకో విద్యార్థి, "పగవాడికైనా పాలే పొయ్య," అన్న మాట జ్ఞాపకం వచ్చింది.

రాజు వెంటనే లేచి పాలలోటా తెచ్చి పాము వచ్చే దారిలో ఉంచాడు. పాము ఆ పాలు తాగి, తాను వచ్చిన దారినే వెళ్ళిపోయింది.

రాజు తెల్లవారినదాకా మేలుకునే ఉన్నాడు, కాని, ఆ తరవాత మరే విశేషమూ జరగలేదు.

తెల్లవారుతూనే రాణి రాజును వెతుక్కుంటూ వచ్చింది; "మీరు రాత్రి పడుకోటానికి రానేలేదు, ఎక్కడ పడుకున్నారు? మీ కళ్ళు చూస్తే తెల్లవార్లూ కన్నుమూసినట్టు లేదు, ఏం చేస్తున్నారు?" అని ప్రశ్నలు వేసింది.

"ఏదో చేశాను. నీకు సంబంధించిన విషయం కాదు," అని రాజు జవాబిచ్చాడు.

రాణీ ఈ విషయంలో చాలా మూర్ఖురాలు. ప్రతి చిన్న విషయమూ రాజు తనకు చెబితే గాని ఆమెకు మనశ్శాంతి ఉండదు. ఆమెతో వేగలేక విసుగుకుంటూనే అయినా రాజు అన్ని ప్రశ్నలకూ సమాధానాలు చెబుతూనే ఉంటాడు.

ఇవాళ రాజు తన ప్రశ్నలకు సమాధానాలు చెప్పకపోయే సరికి రాణి మరింత మూర్ఖించి, "రాత్రి ఎక్కడున్నారో, ఏం చేస్తున్నారో చెబితేగాని నేను వదిలిపెట్టను," అన్నది.

"మూర్ఖుడికి దండమే ఔషధం," అని మూడో విద్యార్థి చెప్పిన మాట జ్ఞాపకం వచ్చి, రాజు సమీపంలో ఉన్న కర్ర తీసుకుని రాణిని రెండు వేశాడు.

ఆ తరవాత రాణి రాజును మూర్ఖంగా ప్రశ్నించటం మానుకున్నది. రాణీలో వచ్చిన యీ మంచి మార్పు వల్ల రాజు చాలా సుఖపడిపోయాడు.





# అమ్ముడుపోయిన బిడ్డ

ఒక గ్రామంలో భార్యాభర్త లుండేవాళ్లు. చాలా కాలానికి భార్య గర్భవతి అయింది. తీరా నెలలు నిండాక ఆమెకు, ఏదన్నా పుణ్యక్షేత్రానికి వెళ్ళి ప్రసవించినట్టయితే మంచి బిడ్డ కలుగుతా డనిపించింది. ఈ మాట తన భర్తతో చెప్పింది. భర్త సమ్మతించి, ఆమెతో సహా కొంత దూరంలో ఉన్న పుణ్యక్షేత్రానికి బయలుదేరాడు.

వాళ్ళు తాముండే నగరం దాటి సాయం కాలానికి ఒక విస్తృతమైన వనం ప్రవేశించారు. ఓపలేని మనిషి కావటంచేత ఆమె అలిసిపోయి, ఎక్కడనైనా కాస్సేపు కూర్చుని విశ్రాంతి తీసుకో గోరింది. దారికి కొంత ఎడంలో ఒక కుటీరం చెట్ల సందుగా కనబడితే, ఆమెను భర్త అక్కడికి తీసుకుపోయాడు.

ఆ కుటీరంలో ఒక సిద్ధు డుంటున్నాడు. ఆయన ఆ భార్యాభర్తలకు అన్ని సాకర్యాలూ అమర్చి కుటీరం వెనక ఉన్న పంచలో ఆ రాత్రికి పడుకోమన్నాడు. భార్య వెంటనే నిద్రపోయింది. భర్తకు ఎంతకూ నిద్ర పట్టలేదు.

ఒక రాత్రివేళ కుటీరం లోపల సిద్ధుడూ, ఆయన శిష్యుడూ మాట్లాడు కోవటం భర్తకు వినిపించింది.

"ఈ మనిషికి ఎలాటి బిడ్డ పుడతా డంటారు?" అని శిష్యు డడిగాడు.

"ఆడబిడ్డ పుట్టుతుంది. కాని తల్లి చని పోతుంది. ఆమెకు పుట్టే ఆడపిల్ల ఒక కొడుకును కని, వాణ్ణి అమ్మేస్తుంది," అన్నాడు సిద్ధుడు.

ఈ మాటలు విని భర్త చాలా బాధ పడ్డాడు. లేక లేక తన కొక బిడ్డ పుడితే అది ఆడపిల్ల కావట మేమిటి? తన భార్య చచ్చిపోవట మేమిటి? తన కూతురు తన కడుపున కనే బిడ్డను అమ్మట మేమిటి?

బి. రమేశబాబు



ఇదంతా ఏదో శాపం అన్నట్టు అతనికి తోచింది.

మర్నాడు తెల్లవారుతూనే అతను తన భార్యను నిద్రలేపి, సిద్ధుడికి కృతజ్ఞత తెలుపుకుని, ఆయన వద్ద సెలవు పుచ్చుకుని, మళ్ళీ తీర్థానికి బయలుదేరాడు. వాళ్లు పుణ్యక్షేత్రం చేరకముందే చూలాలికి నొప్పులారంభమైనాయి. ఒక కాపువాడి గుడిసెలో ఆమె ఆడపిల్లను ప్రసవించి, కొద్ది సేపటిలో ప్రాణాలు వదిలింది.

సిద్ధుడి నోట విన్న రెండు అంశాలలో ఒకటి అక్షరాలా నిజమయింది. మిగిలినది ఎట్లాగైనా అబద్ధం చెయ్యాలని భర్త అనుకుని, తన కుమార్తెను ఇంటికి తెచ్చి, ఆ బిడ్డను పెంచటానికి ఒక దాదిని ఏర్పాటు చేసి, తన కాలమంతా ధనార్జనకు వినియోగించాడు. అతని కృషి ఫలించింది. పిల్లకు అయిదేళ్ళు నిండే లోపల అతను చాలా పెద్ద ధనవంతు డయాడు.

ఆయన నగరం వెలపల ఒక ఒంటి స్తంభం మేడ కట్టించి, దాని పై బురుజులో తన కుమార్తె, ఆమె దాదీ ఉండటానికి ఏర్పాటు చేశాడు. వాళ్ళు కిందికి దిగి వచ్చే మార్గం లేదు. వాళ్ళకు కావలసిన వస్తువులన్నీ కింది నుంచి తట్టలలో అందిస్తే పైకి చేదుకోవాలి. తన కుమార్తె ఒక బిడ్డను కని, ఆ బిడ్డను అమ్ముకుంటుందంటే అంతకన్న భయంకరమైన విషయం మరొకటి ఉండదనే భావంతో తండ్రి ఇలా చేశాడు.

ఆయన కుమార్తె రూపరాణి ఆ ఒంటి స్తంభం మేడ మీది బురుజులోనే పెరిగి పెద్దదై, చాలా అందగత్తెగా తయారయింది. ఆమెకు తన తండ్రి ముఖమూ, దాది ముఖమూ తప్ప మూడో మనిషి ముఖం తెలియదు.

ఒకనాడామె తన బురుజులో నిలబడి బయటికి చూస్తూండగా కొద్ది దూరంలో ఒక గుడారం కనిపించింది. అది ఆ నగరపు

రాజకుమారుడు వేటకు వచ్చి వేయించు కున్న గుడారం. రూపరాణి చూసే సమయానికి గుడారం దగ్గిర రాజకుమారుడు వేటదుస్తులతో నిలబడి ఉన్నాడు.

రూపరాణి తన దాదిని పిలిచి, "దాదెమ్మా, ఆ వింత జంతువును చూశావా? దాని పే రేమిటి ?" అని అడిగింది.

"అది జంతువు కావమ్మా, రాజకుమారుడు. మంచి అందగాడు కూడానూ," అన్నది దాది. రూపరాణి దాదెమ్మ చెప్పిన కథ లన్నిటిలోనూ రాజకుమారుళ్ళూ, రాజకుమార్తెలూ ఉండేవాళ్లు. వాళ్లు ప్రేమించుకుని పెళ్ళి చేసుకున్నారు. అందుచేత రూపరాణి ఆ రాజకుమారుణ్ణి ఆసక్తితో చూసింది.

రాజకుమారుడు కూడా రూపరాణిని చూసి, ఆమె అందానికి ఆశ్చర్యపడి సమీపానికి వచ్చి, ఆమెను పలకరించాడు. రూపరాణి బురుజు చుట్టూ ఉన్న పిట్టగోడ వద్దకు వచ్చి, దాని మీదుగా వంగి రాజకుమారుడితో మాట్లాడింది.

అది మొదలు రాజకుమారుడు వేట నెపం మీద తరచుగా అటుకేసి రాసాగాడు. ఇద్దరి స్నేహమూ త్వరలోనే ప్రేమగా మారింది. తనను ఒక్కసారి పైకి రానివ్వమని రాజకుమారుడు రూపరాణిని ఎన్నో సార్లు ప్రార్థించాడు. చివర కామె ఉండబట్టలేక ఒక తాడు కిందికి దించింది. దాని సహాయంతో రాజకుమారుడు పైకి వచ్చాడు.



వారిద్దరి మధ్యా ఉండే ప్రేమ చూసి దాది వాళ్ళ గాంధర్వ వివాహనికి అభ్యంతరం చెప్పలేక పోయింది. రాజకుమారుడు అప్పుడప్పుడూ వచ్చి, రూపరాణితో ఒకటి, రెండు రోజులు సుఖంగా గడిపి, తన దగ్గిర ఉన్న ఉంగరమో, పతకమో ఆమె కిచ్చి వెళ్ళిపోతూండేవాడు.

కొంతకాలం గడిచాక రూపరాణి గర్భవతి అయింది. ఇంత జరిగాక కూడా రూప



రాణి తన రహస్య వివాహం గురించి తండ్రికి చెప్పటానికి భయపడింది. ఎందుకంటే ఆయన, తాను నిర్ణయించిన భర్తను తప్ప తన కుమార్తె పెళ్ళాడరాదనీ, తాను పెళ్ళి చేసేదాకా ఆమె అవివాహితగా ఉండి తీరవలసిందే ననీ కఠినంగా శాసించాడు.

అదే విధంగా రాజకుమారుడు కూడా తన రహస్యవిహవాం గురించి తన తండ్రికి చెప్పలేకపోయాడు. ఎందుకంటే రాజు తన కుమారుడు ఒక గొప్ప రాజకుమార్తెను పెళ్ళాడా లన్న ఉద్దేశంతో ఉండి, చిల్లర మల్లర రాజకుమార్తెల సంబంధాలను చాలావాటిని కొట్టిపారేశాడు. అటువంటివాడు ఒక సామాన్య కుటుంబానికి చెందిన పిల్లను తన కోడలుగా అంగీకరించడని రాజకుమారుడికి తెలుసు.

కాలక్రమాన రూపరాణి ఒక మగబిడ్డను కన్నది. అందువల్ల ఒక కొత్త సమస్య వచ్చి పడింది. ఆ బిడ్డను సాధ్యమైనంత త్వరగా ఎక్కడికైనా సాగనంపకపోతే రహస్యం దాగదు. ఎందుకంటే, వారానికీ, పదిరోజులకూ ఒకసారి రూపరాణి తండ్రి వచ్చి, కింది నుంచే తన కూతురితోనూ, ఆమె దాదితోనూ మాట్లాడి పోతుంటాడు. ఆయన వచ్చిన సమయంలో చంటిపిల్లవాడు ఏడవ నారంభిస్తే రహస్యం బయటపడిపోతుంది.

అందుకని రూపరాణీ, దాదీ కూర్చుని, పసిగుడ్డును బయటికి చేరవేసే ఉపాయం ఒకటి ఆలోచించారు. ఆ రోజు చీకటిపడే వేళకు దాది తాడు సహాయంతో కిందికి దిగి వెళ్ళి, పూలతోటలు చేరుకుని, అక్కడ ఒక గంపెడు పూలు కొని తెచ్చింది. రూపరాణి పిల్లవాడికి కడుపునిండా పాలు పట్టి నిద్రపుచ్చి, ఆ గంపలోనే పూల మధ్య పడుకోబెట్టి, రాజకుమారుడు తన కిచ్చిన కానుక లన్నిటినీ పిల్లవాడితోనే ఉంచి, పైన మళ్ళీ పూలు కప్పింది.

దాది ఆ గంపను తీసుకుని కిందికి దిగి తిన్నగా రాజభవనానికి వెళ్ళి, అక్కడి దాసీలతో, "రాణీగారి కోసం పూలు తెచ్చాను. రెండు వరహా లిచ్చి తీసుకో మనండమ్మా!" అన్నది.

గంపెడు పూలు రెండు వరహాలకు దొరుకుతున్నాయని వినగానే రాణి, దాసీలకు రెండు వరహా లిచ్చి పంపి గంపను తెప్పించుకున్నది. ఆమె ఆత్రంగా పై పూలు తీస్తుంటే, వాటి అడుగున సుఖంగా నిద్ర పోతున్న బిడ్డ కనిపించాడు. పసిగుడ్డే గాని, చూస్తే కులీనుల బిడ్డలాగా కనిపించాడు. రాజుగారు కూడా వచ్చి చూసి, "ఆహా! ఎంత చక్కని బిడ్డ!" అన్నాడు.

గంప తెచ్చిన మనిషి కోసం దాసీలను పంపితే ఆ మనిషి అప్పుడే వెళ్ళిపోయింది. కనక ఆ బిడ్డ ఎవరి బిడ్డో తెలుసుకునే అవకాశం లేదు. బిడ్డతో బాటు రూపరాణి పెట్టిన ఉంగరాలూ, పతకాలూ అవీ కూడా కనిపించాయి.

"ఈ బిడ్డ తప్పక ఎవరో కులీనుల బిడ్డ, గొప్పవాళ్ళ బిడ్డ! వీణ్ణి మరెవరూ పెంచటానికి వీల్లేదు. మనమే పెంచుకుందాం," అన్నాడు రాజు. రక్తస్పర్శ మూలానో ఏమో రాణికి కూడా అలాగే అనిపించింది.



రాజకుమారుడు బిడ్డ తన బిడ్డేనని గుర్తించాడు. కాని ఆ సంగతి పైకి ఎలా చెబుతాడు? తన తల్లిదండ్రులే పెంచుకుంటున్నారు గదా, సమయం వచ్చినప్పుడు చెప్పవచ్చు లెమ్మనుకున్నాడు.

అంతా బాగానే ఉన్నది గాని, తల్లి స్పర్శ లేని కారణం చేతనో ఏమో చంటిబిడ్డ అస్తమానమూ ఏడవసాగాడు. వాణ్ణి ఊరుకోబెట్టటం ఎవరివల్లా కాలేదు. అలిసిన దాకా ఏడ్చి సొమ్మసిల్లి నిద్రపోతాడు. మళ్ళీ లేస్తూనే ఏడుస్తాడు.

"పిల్లలకు జోల పాడందే ఏడుపు మానరు. ఎవరన్నా వచ్చి జోల పాడండి,"



అని రాజభవనంలోని స్త్రీలను రాజు ఆజ్ఞాపించాడు. అందరూ పాడారు కాని ఎవరి పాటకూ బిడ్డ ఏడుపు మానలేదు.

రాజుగారు, నగరంలో ఉండే స్త్రీలందరూ వచ్చి తన పెంపుడు బిడ్డకు జోలపాడాలని చాటింపు వేయించాడు. వందలకొద్దీ ఆడవాళ్ళు రాజభవనానికి వచ్చి జోలలు పాడారు, కాని బిడ్డ ఏడుపు మాన్పటం ఎవరి తరమూ కాలేదు.

"ఇంకెవరూ ఆడవాళ్ళు నగరంలో లేరా?" అని రాజు అడిగాడు.

"నగరం వెలపల ఒంటి స్తంభం మేడ మీద ఎవరో అమ్మాయి ఉంటున్నది. ఆ అమ్మాయి తప్ప అందరూ వచ్చారు, మహారాజా!" అని భటులు చెప్పారు.

"అందరూ వచ్చినప్పు డా అమ్మాయి ఎందుకు రాలేదు? అంత అహంకారా?" అని రాజు అడిగాడు.

"ఆమె తండ్రి ఆమెను మేడ దిగి రానివ్వడు," అని భటు లన్నారు.

"ఆ తండ్రిని పట్టుకు రండి," అన్నాడు రాజు. రూపరాణి తండ్రిని రాజభటులు పట్టుకు తెచ్చారు.

"నగరంలో ఉండే స్త్రీలందరూ రావాలని చాటింపు వేస్తే నీ కూతురు మాత్రం వచ్చి మా బిడ్డకు జోల పాడలేదు, ఏమిటి కారణం?" అని రాజు ఆయనను అడిగాడు.

"మహారాజా, నా కుమార్తె పెళ్ళి గాని పిల్ల. దానికి జోలపాట లేం వస్తాయి?" అన్నాడు రూపరాణి తండ్రి.

"అది నీ కెందుకు? పాటలు రాక పోయినా అందరూ వచ్చి జోల పాడవలసిందే. అది నా ఆజ్ఞ!" అన్నాడు రాజు.

రూపరాణి తండ్రి వెళ్ళి, ఇన్నాళ్లయాక తన కుమార్తెను తెచ్చాడు.

"పిల్లవాడు ఏడుస్తున్నాడు. నువు జోల పాడితే పోరు మానేస్తాడేమో, పాడు," అన్నాడు రాజు.

రూపరాణి చిచ్చి కొట్టుతూ ఇలా పాడింది:

"ఏడవకు, ఏడవకు, నా చిట్టితండ్రీ!
నీ తల్లి నిజముగా నిర్భాగ్యురాలు,
అపవాదు భయముతో అమ్మింది
నిన్ను!
నీ తండ్రి గుణశాలి నిన్ను రక్షించు!
నీ తాత మహరాజు నిన్ను పోషించు!
నీ తల్లి మాత్రమే నిర్భాగ్యురాలు!
ఏడవకు, ఏడవకు, నా కన్నతండ్రి."

రూపరాణి చెయ్యి తగిలి, ఆమె కంఠం వినిపించిన మరుక్షణమే బిడ్డ ఏడుపు మానేసి, పాట ముగిసేలోపల నిద్రపోయాడు.

రాజుగారు రూపరాణి దగ్గిరికి వచ్చి, "నువ్వే ఈ బిడ్డ తల్లివి! సందేహం లేదు. కన్నబిడ్డను ఎందుకమ్మావు?" అన్నాడు.

రూపరాణి తలవంచుకుని మాట్లాడలేదు.

రాజు ఈ సారి మృదువుగా, "నిజం చెప్పమ్మా. నీ కొచ్చిన భయమేమీ లేదు. నీ మీద ఈగ వాలనివ్వను. ఈ బిడ్డ తండ్రి ఎవరు?" అని మళ్ళీ అడిగాడు.

రూపరాణి తల ఎత్తి రాజకుమారుడి కేసి చూసి, మళ్ళీ తలవంచుకున్నది.

అప్పుడు రాజకుమారుడు తండ్రికి నిజం చెప్పి క్షమాపణ వేడాడు.

రూపరాణి కూడా ఏడుస్తూ తండ్రి కాళ్ల మీద పడింది. తండ్రి రూపరాణిని లేవనెత్తి, "నీ తప్పేమీ లేదులే, తల్లీ. ఇలా జరుగుతుందని నువ్వు పుట్టక మునుపే ఒక మహానుభావుడు చెప్పాడు. ఆయన మాట అబద్ధం చేతామని ఏటికి ఎదురీదాను. రాసి పెట్టినది తప్పించటం మన వల్ల అవుతుందా?" అన్నాడు.

రాజుగారు ఆయన నుంచి జరిగిన కథంతా విని తన కొడుకును క్షమించి, తన కోడలిని స్వీకరించాడు. ఆయన తన కొడుకు పెళ్ళి, మనవడి బారసాలా ఒకే సారి మహా వైభవంగా జరిపించాడు.





# పోయిన ఆవులు

ఒక పర్వతప్రాంతంలో రామన్న అనే దిక్కులేని కుర్రవాడొకడుండేవాడు. వాడు పని కోసం వెతుక్కుంటూ ఒక గ్రామం నుంచి ఇంకో గ్రామానికి పోతూ, కొండలు ఎక్కుతూ, దిగుతూ చివరకు ఒక ఆసామి వద్దకు వచ్చి పని అడిగాడు.

"నిన్ను పనిలో పెట్టుకుంటాను. మాకు పది ఆవులున్నాయి. వాటిని రోజూ అడవికి తీసుకుపోయి మేపి, తిరిగి ఇంటికి చేర్చాలి. నీకు ఒక ఏడాది గడువిస్తాను. ఈలోగా నా ఆవులమంద రెట్టింపయిందా, పెళ్ళిచేసి, నిన్ను బతికున్నన్నాళ్ళూ పోషిస్తాను. అలా కాక మరో విధంగా జరిగిందో, ఏం చేస్తానో ఇప్పుడు చెప్పను," అన్నాడు ఆసామి.

ఆసామి చెప్పిన నిబంధనలకు ఒప్పుకుని రామన్న ఆయన వద్ద పనికి కుదిరాడు. వాడు రోజూ ఆవులను అడవికి తోలుకుపోయి, మేపి ఇంటికి తెస్తూవచ్చాడు.

ఒక రోజు అడవిలో రామన్న పశువులను మేపే చోటికి ఎవరో కుర్రాడు వచ్చి రామన్నతోబాటు చెట్టుకింద కూర్చుని, సరదాగా ఏవేవో కబుర్లు చెప్పాడు. పొద్దువాలి రామన్న ఆవులను ఇంటికి తోలుకుపోయే వేళ అయినప్పుడు రెండో కుర్రాడు రామన్నతో, "నీ కొక తమాషా చూపిస్తాను, చూడు," అంటూ కొన్ని చిన్నచిన్న రాళ్ళను ఒక చిన్న గుట్టగా పేర్చి, దాన్ని మంత్రించినట్టు నటించాడు.

"ఎందుకు అలా చేస్తున్నావు?" అని రామన్న వాణ్ణి అడిగాడు.

"ఈ రాళ్ళ కుప్పకు మంత్రం వేశాను. రేపు పొద్దున మనం ఇక్కడికి వచ్చేసరికి ఈ కుప్ప జీడిమిఠాయిగా మారి ఉంటుంది, చూసుకో," అన్నాడు రెండో కుర్రాడు.

రామన్న వాడి మాటలు నమ్మలేదు, కాని వాడు మర్నాడు వచ్చేసరికి నిజంగానే

ఎం. బాలచంద్రరావు



అక్కడ జీడిమిఠాయి కుప్ప ఉన్నది. రామన్న వచ్చేసమయానికే ఇంకో పక్క నుంచి ఆ కుర్రాడు, "నా మంత్రం పారిందా?" అంటూ వచ్చాడు; దగ్గిరికి వచ్చి మిఠాయి చూసి, "నే చెప్పలేదా? ఉండు, దీన్ని మనిద్దరమూ తిందాం," అంటూ మిఠాయిని జాగ్రత్తగా రెండు భాగాలుచేసి, ఒకటి రామన్న కిచ్చాడు. రెండోది తను తీసుకున్నాడు. ఇద్దరూ ఎవరి భాగాలు వాళ్ళు తిన్నారు.

తన వంతు మిఠాయి సాంతం తినేలోపలనే రామన్నకు మత్తులాగా నిద్ర ముంచుకొచ్చింది.

ఆ రెండో కుర్రాడు దొంగల తాలూకు మనిషి. వాడు రామన్న కిచ్చిన మిఠాయి భాగంలో మత్తుమందున్నది. అందుకే రామన్నకు ఒళ్ళు తెలియని నిద్ర వచ్చింది.

రామన్నకు స్పృహ తెలియకుండా పోయిన కొద్దిసేపటికి చెట్ల చాటు నుంచి నలుగురు దొంగలు వచ్చారు. రామన్నను కదిలించి చూశారు. వాడు మంచి మత్తులో ఉన్నాడు. దొంగలు పది ఆవుల మెళ్ళలోనూ ఉండే మువ్వల పట్టెడలు విప్పి కుర్రాడికిచ్చారు. వాడు వాటిని కిందుగా ఉండే చెట కొమ్మలకు వేళ్ళాడ గట్టాడు.




తరవాత ఆవులను తోలుకుంటూ దొంగలూ, వాళ్ళ కుర్రాడూ వెళ్ళిపోయారు.

తరవాత చాలా సేపటికి రామన్నకు కొద్దిగా స్పృహ తెలిసింది. కాని కళ్ళు తెరవలేకపోయాడు. గాలికి కొమ్మలు ఊగుతుంటే మువ్వలు చప్పుడు చేస్తున్నాయి. ఆవులు మేత మేస్తున్నాయిగదా అనుకుని వాడు మళ్ళీ నిద్రమత్తులో పడిపోయాడు. వాడికి పూర్తిగా స్పృహ వచ్చేసరికి పొద్దు పూర్తిగా వాలిపోయింది. వాడు లేచి కూర్చుని కళ్ళు తెరిచి చూస్తే కనుచూపు మేరలో ఒక్క ఆవుకూడా లేదు. మువ్వల చప్పుడు చెట్ల కొమ్మల నుంచి వస్తున్నది.



రామన్న ముప్పల పట్టెడలు పదింటినీ తీసుకుని ఇంటికి వెళ్ళి, తన యజమానితో, "ఆవులను ఎవరో ఎత్తుకుపోయారు," అని బిక్క ముఖం వేసుకుని చెప్పాడు.

యజమాని రామన్నను ఏమీ అనలేదు; "శాంతా" అని తన కూతురిని పిలిచి, "ఈ పట్టెడలను కూడా మిగిలిన తొంభై పట్టెడలతో చేర్చిపెట్టు," అన్నాడు. ఆయన తన మీద ఆగ్రహించనందుకు రామన్న చాలా సంతోషించాడు.

మర్నాడు ఉదయం యజమాని రామన్నను పిలిచి, వాడి కొక సంచీ ఇచ్చి, "నువు అడవికి వెళ్ళి ఈ గోతం నిండా తుమ్మముళ్ళకంప తీసుకో, ఒక కట్ట చింత బరికెలు కోసుకో, రెండూ పట్టుకుని త్వరగా రా," అన్నాడు.

రామన్న అడవికి వెళ్ళి, గోతం నిండా తుమ్మముళ్ల కంప వేసుకుని, చంకలో చింతబరికెల కట్ట పెట్టుకుని ఇంటిదారి పట్టాడు. మధ్య దారిలో యజమాని కూతురు శాంత ఎదురు తగిలి, "ఏమిటి నువు చేస్తున్నది? వీటిని మా నాన్న ఎందుకు తెమ్మన్నాడో నీకు తెలియులేదా? నిన్ను తుమ్మముళ్ళ మీద పడుకోబెట్టి, ఈ చింత బరికెలతో బాదటానికి! వాటిని అవతల పారేసి ఎటైనా పారి పో. మా నాన్న తొమ్మిదిమందిని అదివరకిలాగే శిక్షించాడు. మాకు నూరావు లుండేవి. పదేసి పదేసి చొప్పున అన్నిటినీ దొంగలు ఎత్తుకు పోయారు. మేం మా ఆవులన్నిటినీ 'భాగ్య లక్ష్మి' అని పిలిచే వాళ్ళం. ఆ పేరుతో పిలిస్తే అవి పలికేవి. నీకు మా నాన్నను మంచి చేసుకోవాలని ఉంటే మా నూరు ఆవులనూ సంపాదించి మరీ మా నాన్న ఎదట పడు. లేదా మళ్ళీ ఈ చాయలకు రాకు," అన్నది.

రామన్న తెలివి గలవాడు. వాడు పశువులను కాచే పనే చెయ్య నిశ్చయించాడు;



కాని కనీసం నూరావులన్నా లేనివాళ్ల దగ్గిర పనిచెయ్య దలచలేదు. విచారిస్తూ వెళ్ళగా ఒక దూర గ్రామంలో ఇంకో గోస్వామి దగ్గిర రెండువందల ఆవుల దాకా ఉన్నట్టు తెలిసింది. రామన్న ఆ గోస్వామి వద్దకు వెళ్ళి, తనకు మందను కాచే పని ఇవ్వ మని అడిగాడు.

"సరిగా సమయానికి వచ్చావు. నాకు ఆవులను కాచేవాడొకడు కావాలి. నా నియమాలు నీకు నచ్చినట్టయితే పనిలో చేరు, లేదా నీ దారిన నువు వెళ్ళు. నేను నిన్ను మూడు నెలలపాటే పనిలో ఉంచుకుంటాను. నీకు వేరే జీతం ఎమీ ఇవ్వను; మూడునెలలూ అయాక నువు పిలిస్తే వచ్చే ఆవులను నీ కిచ్చేస్తాను. వాటిని నువు తోలుకు పోవచ్చు. అవే నీ జీతం డబ్బులు," అన్నాడు గోస్వామి.

ఈ గోస్వామి దొంగ బేరం చేసేవాడు. దొంగలు తెచ్చిన ఆవులను చవుకగా కొంటూ ఉంటాడు. ఈ విధంగా కొన్న ఆవులే అతని కున్న రెండువందలూనూ. ఏ కాపరినీ మూడు నెలలు మించి ఉంచడు. మూడు నెలల లోపల ఆవును, పిలిస్తే వచ్చేటంతగా మచ్చిక చెయ్యటం ఏ కాపరి కుర్రాడికీ సాధ్యం కాదు. అందుచేత




రామన్నకు ముందు పనిచేసిన కుర్రాడి కెవడికీ జీతం ఏ రూపంలోనూ ముట్టలేదు.

రామన్న మొదటి రోజున రెండువందల ఆవులమందనూ దూరంగా మేతకు తోలుకు పోయి, అవి మేసేటప్పుడు. తాను కూర్చున్న చోటినుంచి, "భాగ్యలక్ష్మి! భాగ్యలక్ష్మి!" అని రెండు మూడుసార్లు పిలిచాడు. వెంటనే మందలో సగం ఆవులు మేతమాని రామన్న దగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చాయి. రామన్న వాటి నన్నిటినీ నిమిరి, తట్టి, "వెళ్ళి మెయ్యండి," అని పంపేశాడు.

అవన్నీ, రామన్న మొదటి యజమాని పోగొట్టుకున్న ఆవులే నని వాడికి రూఢిగా

తెలిసిపోయింది. వాడు ఎట్లాగో మూడు నెలలూ ముగించేశాడు. ఆ రోజు గోస్వామి వాణ్ణి పిలిచి, "రేపు నువ్వు వెళ్ళిపోయేటప్పుడు పిలిస్తే నీ వెంట వచ్చే ఆవు ఏదైనా ఉంటే తోలుకు పోవచ్చు," అన్నాడు.

మర్నాడు పొద్దునే రామన్న ఊళ్ళోకి వెళ్ళి ఊళ్ళో ఉండే నలుగురు పెద్దలనూ ఆహ్వానించి తన వెంటబెట్టుకుని యజమాని దగ్గిరికి వచ్చాడు.

"వీరందరినీ ఎందుకు తెచ్చావురా?" అని గోస్వామి అడిగాడు.

"ఏమో, బాబూ. ఏ ఆవైనా నేను పిలిస్తే నా వెంట వచ్చిందనుకోండి. మీరు దాన్ని నా వెంట తీసుకు పోనిస్తారు. కాని నేను ఆవును దొంగతనంగా తీసుకుపోతున్నాననుకుని ఈ పెద్దమనుషులు అడ్డగించవచ్చు. నాకు వచ్చే జీతమేదో వీరందరూ చూస్తుండగానే తీసుకు పోవటం మంచిది గద," అన్నాడు.

"సరే, ఆవులను కేకెయ్యి. నీ వెంట ఏ ఆవు వస్తుందో చూస్తాం," అన్నాడు గోస్వామి చిరాకుగా.

రామన్న మంద ఉన్న చోటికి వెళ్ళి, "భాగ్యలక్ష్మీ! భాగ్యలక్ష్మీ!" అని కేకలు పెట్టాడు. వెంటనే వంద ఆవులు పరిగెత్తుకుంటూ వచ్చి, రామన్నను చుట్టుముట్టాయి. పెద్దలందరూ చూస్తుండగా రామన్న నూరింటినీ ఎంచి, నోరు తెరుచుకుని చూస్తున్న గోస్వామి దగ్గిరా, గ్రామపెద్దల దగ్గిరా సెలవు పుచ్చుకుని, వాటితో మొదటి యజమాని ఇంటికి వెళ్ళి, "ఇవిగో, బాబూ! మీ పది ఆవులను నూరు చేసి తెచ్చాను," అన్నాడు.

శాంత గబగబా మువ్వలపట్టెడలనన్నిటినీ తెచ్చి అన్ని ఆవుల మెడలకూ తగిలించింది.

శాంత తండ్రి ఏమీ అనలేదు; పురోహితుణ్ణి పిలిపించి, రామన్నకు శాంతనిచ్చి పెళ్ళి చేసి, కూతురినీ, అల్లుణ్ణీ తన ఇంటనే ఉంచుకున్నాడు.





# కృష్ణావతారం

గోకులానికి ఎలాటి బట్టలతో వెళ్ళాడో వాటితోనే బలరాముడు మధురకు వచ్చి, తిన్నగా కృష్ణు డింటికి వెళ్ళాడు. కృష్ణు డతని పాదాలకు నమస్కారం చేసి, స్వాగతం తెలిపాడు. తరవాత అన్నదమ్ము లిద్దరూ వసుదేవుడి ఇంటికి వెళ్ళారు. వసుదేవుడు బలరాముణ్ణి కౌగలించుకుని, విశేషాలు అడిగాడు. బలరాముడు గోకులంలో తాను చేసిన ఘనకార్యం ఒకటి చెప్పాడు.

అతను ఒకనాడు తాను కూర్చున్న చోటి నుంచి కాళిందీనదిని పిలిచి, తన దగ్గిరికి వచ్చి, తన చేత స్నానం చేయించమన్నాడు. కాళిందీనది రాలేదు. బలరాముడికి కోపం వచ్చింది. అతను తన నాగలిని కాళిందికి వేసి లాగాడు. ఆ విధంగా బృందావనానికి కాళింది కాలువ ఒకటి ఏర్పడి, గోపకులకు చాలా ఉపకారం జరిగింది.

కొంతకాలం గడిచింది. ఒకనాడు కృష్ణుడు యాదవుల సభలో ఒక ప్రతిపాదన ఈ విధంగా చేశాడు:

"మనం నివసించే ఈ మధుర లాటిది ప్రపంచంలో మరొకటి లేదు. ఇలాటి క్షేత్రం కూడా మరెక్కడా ఉండదు. మేం వ్రేపల్లెలో పెరిగినా, పుట్టటం ఇక్కడే పుట్టాం. ఇక్కడికే తిరిగివచ్చి సకలైశ్వర్యాలూ సంపాదించుకున్నాం. అయితే, ఇక్కడ మనకు శత్రుబాధ జాస్తి అయింది. ప్రపంచంలో ఉండే రాజులందరూ జరాసంధుడి వెంట ఎత్తివచ్చి, ఎటువంటి హింసాకాండ జరిపారో మీరు చూశారు కద!

## 15. ద్వారవతి నిర్మాణం





ఈ ప్రమాదం తుదముట్ట లేదు. మనకు మంది మార్బలం ఉన్నది. ఏనుగులూ, గుర్రాలూ, రథాలూ ఉన్నాయి. పుష్కలంగా బంగారమూ, రత్నరాసులూ ఉన్నాయి. కాని ఏం లాభం? మన శత్రువులు వచ్చి పడ్డప్పుడల్లా మనం మనకున్నది నష్టపోతున్నాం. ఇది సహించరానిది. అందుచేత మనం ఇక్కడినుంచి వెళ్ళిపోవటం నాకు కర్తవ్య మనిపిస్తున్నది. మనం ఉండటానికి మరొక ప్రదేశం చూస్తాను. అక్కడికి పోయి సుఖంగా ఉందాం."

కృష్ణుడు చెప్పిన మాటలు యాదవులకు సరిగా ఉన్నట్టే తోచాయి. జరాసంధుణ్ణి చంపటం సాధ్యం కాదు. అతని వెనక అంతులేని సేన ఉంటున్నాయి. యుద్ధం చెయ్యవచ్చు. ఆ యుద్ధం ఎప్పటికీ తెగదు. జరిగేదల్లా ఉభయ పక్షాలవారూ నాశనం కావటం. కృష్ణుడు నిరపాయ స్థలం చూపే పక్షంలో అక్కడికి పోవటమే మంచిదని యాదవనాయకు లనుకున్నారు.

కృష్ణుడు యాదవుల నందరినీ ఫలాని చోటికి తీసుకుపోవాలని తన మనసులో నిశ్చయించుకుని, అందరినీ ప్రయాణ సన్నాహాలు చేయమన్నాడు.

ఇదే సమయంలో కాలయవను డనే వాడు మధుర మీదికి సైన్యాలతో సహా బయలుదేరాడనీ, జరాసంధుడు కూడా అదే ప్రయత్నం ప్రారంభించాడనీ తెలియ వచ్చింది. ఈ సంగతి వింటూనే కృష్ణుడు, "మనం ఇవాళే బయలుదేరుదాం. ఈ రోజు చాలా బాగుంది," అని తన వారికి చెప్పాడు.

వసుదేవుడూ, ఉగ్రసేనుడూ, బలరామ కృష్ణులూ, వారి వెంట వృష్ణి, అంధక వీరులూ, వారి కుటుంబాలూ, అంతులేని ఏనుగులతో, రథాలతో, గుర్రాలతో, తమ సంపద లన్నిటినీ వెంట తీసుకుని మధురా నగరం విడిచి, పడమటి దిక్కుగా ప్రయాణ మయారు. వారు అలా రోజూ ప్రయాణం





చేస్తూ పశ్చిమ సముద్రతీరాన్ని చేరుకున్నారు. అది అనేక చెట్లతోపులతో కూడుకుని ఉన్న గరువుప్రదేశం. ఆ ప్రాంతంలోనే పూర్వం ఏకలవ్యుడు ద్రోణాచార్యులను పూజించాడు.

ఎక్కడ ఇళ్ళు కట్టాలో, ఎక్కడ తోటలు పెంచాలో, ఎక్కడ నీటి సదుపాయాలున్నాయో బాగా ఆలోచించి, అక్కడ ఒక అందమైన నగరం నిర్మించి, దానికి ద్వారవతి అని పేరు పెట్టారు. అందరికీ నగరంలో మంచి ఇళ్ళు ఏర్పాటయాయి. యాదవులకు శత్రుభయం తీరిపోయింది. వాళ్ళు సుఖంగా, నిశ్చింతగా ద్వారవతిలో జీవించసాగారు. అయితే ద్వారవతీ నిర్మాణానికి ముందు చాలా కథ నడిచింది.

ఎటువంటి శత్రువునూ లక్ష్యపెట్టని కృష్ణుడు కాలయవనుడికి వెరిచి, మధుర విడిచిపెట్టి, పడమటి సముద్రాన నగరం నిర్మించుకోవటానికి కారణం ఉన్నది. అదొక చిన్న కథ.

ఒకప్పుడు వృష్ణి, అంధకకులాల వారికి గర్గు డని ఒక గురువు ఉండేవాడు. అతను అజన్మబ్రహ్మచర్యం అవలంబించాడు. గర్గుడు యాదవుల మధ్య ఉండగా ఒకసారి ఎవడో ఆయనను చూసి, మగవాడు కాదు,



ఆడది అని అపహాస్యం చేశాడు. యాదవులు ఆ మాట విని ఊరుకున్నారు గాని తమ ఆక్షేపణ తెలపలేదు.

గర్గుడికి మండిపోయింది. అతను అడవికి వెళ్ళి, పన్నెండేళ్ళ పాటు లోహచూర్ణం తింటూ, అతి ప్రచండమైన తపస్సు చేసి, శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, వృష్ణి, అంధకులను పీడించగల కొడుకు తనకు కలిగేటట్టు వరం పొందాడు. ఈ సంగతి తెలిసి, కొడుకులు లేని యవనేశ్వరుడు, అతన్ని పిలుచుకు పోయి, తన గోవుల మందల మధ్య అతనికి నివాసం ఏర్పాటు చేసి, అతనికి కావలసిన ఏర్పాట్లన్నీ చేశాడు.







గర్గుడు అలా గోవుల మందల మధ్య నివసిస్తూండగా ఒక అప్సరస గోపిక రూపంలో అతని వద్దకు వచ్చి, ఈశ్వరాదేశం ప్రకారం గర్భవతి అయి, కాలయవనుణ్ణి కన్నది. ఆ కుర్రవాణ్ణి యవనరాజు తన కొడుకుగా పెంచి, పెద్దవాణ్ణి చేశాడు. కాలయవనుడు గొప్ప తేజోవంతుడూ, పరాక్రమవంతుడూగా పెరిగాడు. అతను ఎంతటి వారినీ లక్ష్యపెట్టేవాడు కాడు.

ఒకనాడు యవనరాజు వద్దకు నారదుడు వచ్చాడు. అప్పుడు కాలయవనుడాయనను, "ప్రపంచంలో గొప్ప వీరు లెవరు?" అని అడిగాడు.

"ఈ నాడు యాదవులను మించిన వీరులు ప్రపంచంలో లేరు," అంటూ నారదుడు చాలా గొప్పగా వర్ణించి చెప్పాడు. నారదుడి మాటలు వింటున్న కొద్దీ కాలయవనుడికి మాత్సర్యం పుట్టుకొచ్చింది. శకవంశానికి చెందిన రాజులూ, హిమాలయంలో ఉండే దస్యులూ అత నెలా చెబితే అలా నడుచుకుంటారు. అందుచేత వారి నందరినీ చేర్చి ఒక సేనగా తయారుచేసి, ఏనుగులనూ, గుర్రాలనూ, గాడిదలనూ అమితంగా వెంటబెట్టుకుని, మధుర మీదికి కాలయవనుడు బయలుదేరాడు.

ఈ సంగతి నారదుడి వల్లనే విని కృష్ణుడు పరిస్థితి అంతా చక్కగా ఆలోచించి, మధుర విడిచి వెళ్ళటమే కర్తవ్యమని నిశ్చయించుకున్నాడు. తానీ నిశ్చయానికి రాగానే యాదవులను హెచ్చరించాడు.

కృష్ణుడు మరొక పని కూడా చేశాడు. అతను ఒక కుండలో ఒక కాలసర్పాన్ని ఉంచి, దానికి వాసెన కట్టి, ఒక దూత చేతికిచ్చి కాలయవనుడి దగ్గిరికి పంపుతూ, ఇలా చెప్పమన్నాడు: "ఈ కుండలో ఉన్న కాలసర్పం లాటిది కృష్ణుడి పరాక్రమం."

ఆ మాట విని కాలయవనుడు ఏమీ అనక, కాలసర్పం ఉన్న కుండలో కంద





చీమలను కొన్నిటిని వేసి, మళ్లీ వాసెన కట్టి, దాన్ని తీసుకుపోయి కృష్ణుడి కియ్య మన్నాడు. "నువు ఎంత బలవంతుడివైనా, అనేక మంది మధ్య ఒంటరిగా చిక్కితే నీ బలం ఎందుకూ పనికిరాదు," అని కాల యవనుడి సందేశం. దాని అంతరార్థం గ్రహించి కృష్ణుడు మధురానగరం నుంచి, యాదవు లందరితోనూ బయలుదేరాడు.

అతను ద్వారవతి నుంచి నిరాయుధు డుగా, కాలినడకన బయలుదేరి తన శత్రువు ఉండే నగరం చేరాడు. అక్కడి వాళ్ళు కృష్ణుణ్ణి గుర్తించి, "చుట్టు ముట్టండి. పట్టుకోండి," అని ఆర్భాటం



చేశారు. ఈ లోపల కృష్ణుడి రాక విన్న కాలయవనుడు తాను కూడా నిరాయుధుడూ, పాదచారీ అయి కృష్ణుడికి ఎదురు వచ్చి, కృష్ణుణ్ణి సమీపించాడు. కాని కృష్ణుడు అతనికి చేయి ఇవ్వబోయేవాడి లాగా నటిస్తూ, ఇవ్వకుండానే అతి వేగంగా ఒక గుహలో ప్రవేశించాడు.

ఆ గుహలో ముచికుందుడనేవాడు నిద్ర పోతున్నాడు. ఈ ముచికుందుడు మాంధాత కొడుకు. అతను దేవాసుర యుద్ధంలో చాలా కాలం యుద్ధం చేసి, దేవతలకు విజయం చేకూర్చి, శ్రమతీరటానికి నిద్ర పోబోతూ, తనకు నిద్రాభంగం కలిగించిన వాణ్ణి తన చూపులతోనే భస్మం చేసేటట్టు వరం పొందాడు. ఈ సంగతి కృష్ణుడికి తెలుసు. అతను గుహలో ప్రవేశిస్తూనే ముచికుందుడి తల వైపున దాక్కున్నాడు.

అతని వెనకగా గుహలోకి వచ్చిన కాల యవనుడు, నిద్రపోతున్న ముచికుందుణ్ణి చూసి కృష్ణుడే నని భ్రమపడి, కాలితో తన్ని, "ఇలా చావు తప్పించుకుందా మను కుంటున్నావా? లే, లే. నీ బలం తెలి సింది," అంటూ వికటాట్టహాసం చేశాడు.

నిద్రాభంగం కలిగి ముచికుందుడు లేచి కూర్చుని, కాలయవనుడి కేసి కోపంగా





చూశాడు. మరుక్షణమే కాలయవనుడు, పిడుగుపడిన చెట్టులాగా అయి, నిలువునా లేచిన మంటలలో బూడిద అయిపోయాడు.

తరవాత కృష్ణుడు తాపీగా ముచికుందుడి ఎదటపడి, "అయ్యా, నీ దిక్కడ ఉన్న సంగతి నాకు నారదుడి ద్వారా తెలిసింది. నా పని నీ మూలాన నెరవేరింది. తృప్తి పడ్డాను. ఇక వెళ్ళివస్తాను," అన్నాడు.

ముచికుందుడు కృష్ణుణ్ణి చూసి, "అయ్యా, నీ వెవరు? ఇక్కడికి ఏం పని మీద వచ్చావు? నాకు నిద్రాభంగం కలిగించిన ఈ మనిషి ఎవరు? నే నిక్కడ ఎంతకాలంగా నిద్రపోతున్నాను? తెలిస్తే చెప్పు," అన్నాడు.

దానికి కృష్ణు డిలా చెప్పాడు:

"చంద్రుడికి సాటి అనదగినవాడు నహుషుడు. ఆయన కొడుకు యయాతి. యయాతికి అయిదుగురు కొడుకులు. వారందరిలోకీ పెద్దవాడు యదువు. ఆ యదువు సంతతిలో వసుదేవు డనే మహనీయుడు పుట్టాడు. ఆ వసుదేవుడికి దేవకి అనే భార్య యందు నేను పుట్టాను. ఆయనకు రోహిణి అనే భార్య యందు పుట్టిన బలరాముడికి తమ్ముణ్ణి, నన్ను వాసుదేవు డంటారు. నీ కోపాగ్నికి ఆహుతి



అయిన ఇతను కాలయవను డనే ప్రసిద్ధుడు, వరంవల్ల పుట్టినవాడు. మరొకవిధంగా చావనివాడు, నా శత్రువు. నీవు త్రేతా యుగంలో పుట్టినట్టు విన్నాను. ఇప్పుడు కలియుగం సమీపిస్తున్నది."

ముచికుందుడు గుహ నుంచి బయటికి వస్తూ తిరిగి రాజ్యం చేసుకుందా మనుకున్నాడు. కాని తీరా భూమి మీద సంచరించే మనుషుల అల్పప్రమాణమూ, అల్పబుద్ధులూ, అల్ప పరాక్రమమూ చూస్తే ఆయనకు రాజ్యాలేలా లనిపించలేదు. అందుచేత ఆయన తపస్సు చేసుకోవటానికి హిమాలయారణ్యాలలోకి వెళ్ళిపోయాడు.



తన ప్రబల శత్రువు చనిపోయాక కృష్ణుడు కాలయవనుడి సేనలోని ప్రధాన వీరులను తన దివ్యాస్త్రాలతో అనాయాసంగా చంపేసి, మిగిలిన సేనలను తన వశం చేసుకుని, అతి వేగంగా వెళ్ళి తన వారిని చేరుకున్నాడు. ఇదంతా జరిగాకనే ద్వారవతీనగర నిర్మాణం జరిగింది.

ద్వారవతీ నిర్మాణానికి విశ్వకర్మ సహాయం పొంద నిశ్చయించి కృష్ణుడు ఆ దేవశిల్పిని స్మరించాడు. వెంటనే విశ్వకర్మ ప్రత్యక్షమై, "నన్నెందుకు స్మరించావు? నా వల్ల ఏం పని కావాలి?" అని అడిగాడు.

"స్వర్గంలో ఇంద్రుడి నగరం ఎలా ఉత్తమంగా ఉంటుందో, భూలోకంలో అలా సర్వోత్తమంగా ఉండే నగరాన్ని నాకు కట్టిపెట్టాలి," అన్నాడు కృష్ణుడు.

"ఈ జనాని కంతకూ తగిన నగరం నిర్మించాలంటే ఇక్కడ ఉన్న ప్రదేశం చాలదు. సముద్రం కొంత వెనక్కు పోయి నట్టయితే, చక్కని విశాలనగరం నిర్మించవచ్చు," అన్నాడు విశ్వకర్మ.

కృష్ణుడు సముద్రుణ్ణి ప్రార్థించాడు. సముద్రుడు ప్రత్యక్షమై, ఎటుచూసినా పన్నెండు యోజనా లుండేటట్టుగా భూమి వదిలి, తాను వెనక్కు వెళ్ళిపోయాడు. అప్పుడక్కడ విశ్వకర్మ దివ్యమైన నగరాన్ని నిర్మించాడు. బంగారపు కోటా, ఆకాశాన్ని అంటే మణిగోపురాలూ, ఎత్తయిన ప్రాసాదాల వరసలూ, హర్మ్యాలూ, చక్కని రాజమార్గమూ, చైత్యాలూ, సభలూ, చావడులూ, తోరణాలూ, బురుజులూ, బావులూ, సరస్సులూ, కల్పిత శిలోద్యానాలూ అవతరించాయి. రాజభవనంలో కృష్ణుడు ఉన్నతాసనంలో కూర్చుంటే, యాదవప్రముఖులందరూ సభతీరారు. కృష్ణుడు విశ్వకర్మను సముచితంగా సత్కరించి ఇంద్రలోకానికి పంపేశాడు.





# అరణ్యపురాణం

## 18

కొవాకు కొంత దూరంలోనే గొంతు కూర్చుంటూ భాలూ, "వేట సాగాలి!" అన్నాడు. అరణ్యంలో వేటాడే మృగాలు ఒకదాన్ని ఒకటి అలాగే పలకరించుకుంటాయి.

"ఓహో, భాలూవా? వేట సాగాలి, బాఘీరా! ఆకలి దహించుకు పోతోంది. ఎక్కడన్నా తిండి దొరికేనా?" అన్నాడు కావా కొండచిలువ.

"మేము వేట పని మీదే ఉన్నాం," అన్నాడు భాలూ.

"అయితే నన్ను కూడా వెంట తీసుకు పోదురూ. మీ వేట క్షణాల మీద అయేది. నే నట్లా కాదే! ఏ కొమ్మకో చుట్టుకుని రోజులూ, వారాలూ వేచి ఉంటేగాని ఏ కోతి పిల్లో దొరకదు. కాకపోయినా ఈ కాలంలో ఏం చెట్లు? ఏం కొమ్మలు? చావ ఏడిస్తేగా? నా చిన్నతనంలో చెట్లకొమ్మలు ఎలా ఉండేవి!" అన్నాడు కావా.

"కాకపోతే మాత్రం నీ బరువు కాస్తా కూస్తానా?" అన్నాడు భాలూ.

కావా కాస్త గర్వంగా, "బారు బాగానే ఉన్నాననుకో. అయినా ఇప్పుడు కొత్తగా పెరిగే చెట్లు ఎందుకూ పనికిరావు. కిందటి మాటు నేను వేట మీద ఉన్నప్పు డేమయిందనుకున్నారు? పడ్డంత పని చేశాను. కొమ్మ మీది నుంచి ఒళ్లు జారసాగింది. ఆ చప్పుడుకు మర్కటులు మేలుకున్నారు. వాళ్లు నన్ను తిట్టిన తిట్లు ఇన్నీ అన్నీ కావు," అన్నాడు కావా.

"కాళ్ళు లేని పచ్చపురుగనా అన్నారు?" అన్నాడు బాఘీర.

"నన్ను వానరులు అంత మాట అన్నారుగా? బుస్!" అన్నాడు కావా రోషంతో.

అట్ట చివరి బొమ్మ.



"నోటికి వచ్చిందల్లా అంటారు. నీ దంతా లన్నీ ఊడాయట! నువు చిన్న చిన్న మేక పిల్లల్ని తప్ప ఇంకే పెద్ద జంతువు ఎదటా పడలేవుట! మేకపోతు కొమ్ములంటే నీకు చచ్చే భయంట! వాళ్ళ నోటికి సుద్దా, బుద్దా?" అన్నాడు బాఘీర.

కావా ఎంతో వయసుగల సర్పం. అలాటి వాడిలో ఆగ్రహం కలిగితే ఒకంతట పైకి తెలీదు. కాని కావా కండరాల కదలికను బట్టి అతనికి బాగా ఆగ్రహం వచ్చినట్టు భాలూ, బాఘీరా తెలుసుకున్నారు.

"మర్కటులు తమ నివాసస్థలం మార్చారు. ఇంతకు ముందు నేను ఎండ పొడలోకి వచ్చినప్పుడు చెట్ల చివరల వాళ్ళ పెడ బొబ్బలు విన్నాను," అన్నాడు కావా.

"మేము మర్కటులనే వేటాడుతున్నాం," అన్నాడు భాలూ.

"మీ ఇద్దరిలాటి మహాయోధులు మర్కటుల వెంట పడటానికి విశేషకారణం ఏదో ఉండాలే!" అన్నాడు కావా.

"నా దేముందిలే. నేను తోడేళ్ళ పిల్లలకు శాస్త్రం చెప్పేవాణ్ణి," అంటూ భాలూ నీళ్ళు నమిలాడు.

బాఘీర అతనికి అడ్డం వచ్చి, "కావా, అసలు విషయం ఏమిటంటే, కాయలు దొంగిలించే కిచకిచగాళ్ళు, మా మనిషి కూనను ఎత్తుకుపోయారు. నువు వాణ్ణి గురించి వినే ఉండవచ్చు," అన్నాడు.

"ఒక మనిషి కూన తోడేళ్ళ మందలో చేరినట్టు విన్నాను గాని, నమ్మలేదు," అన్నాడు కావా.

"ఆ మాట నిజమే, కావా. అలాటి మనిషి కూనను ఎక్కడా చూడం. ఎంత తెలివి! ఎంత ధైర్యం! వాడి మూలంగా నా కెంత కీర్తి రానున్నది! మాకు వాడంటే ప్రాణం!" అన్నాడు భాలూ.

"ప్రేమంటే ఏమిటో నాకూ తెలుసు. మీకు ఎన్ని గాథలనైనా చెప్పగలను–" అని



కావా ఆరంభించే సరికి, బాఘీర చప్పున అడ్డుతగిలి, "కడుపులు నిండినాక రాత్రల్లా కూర్చుని ఆ కథలు చెప్పుకుందాం. ప్రస్తుతం మా మనిషి కూన మర్కటుల చేతికి చిక్కాడు. కావా అంటే మర్కటులకు హడలుగదా!" అన్నాడు.

"వాళ్ళకు నేనంటేనే భయం. మూర్ఖులు వదరుబోతులు, వాగుడుకాయలు. నన్ను పచ్చచేప అన్నారు కదూ?" అన్నాడు కావా.

"చేపకాదు, పురుగు-పురుగు! ఆ ఒక్కటేనా? ఇంకా ఎంతేసి మాటలన్నారు! నాకు చెప్పటానికూ్కడా నోరు రావటం లేదు."

"ఫుస్! వాళ్ళకి కాస్త బుద్ధి చెప్పాలి. పిల్లవాణ్ణి తీసుకుని వాళ్ళు ఎటుగా వెళ్ళారు?" అని కావా అడిగాడు.

"సూర్యాస్తమయం కేసి వెళ్ళినట్టు తోస్తుంది. వాళ్ళ జాడ నీకే తెలుస్తుం దను కున్నామే," అన్నాడు భాలూ.

"నాకా? ఎలా తెలుస్తుంది? నేను మర్కటులనూ, కప్పలనూ, కంగాళీ వాటినీ వేటాడనే. నా దగ్గిరికి వస్తే పట్టుకుంటాను," అన్నాడు కావా.

ఇంతలో ఆకాశం నుంచి, "భాలూ! ఇలా చూడు! పైకి, పైకి!" అన్న కేక కీచుగా వినిపించింది.



అది డేగన్న కేక. అతను భాలూ కోసం అరణ్యమంతా తెగతిరిగి, ఇప్పటికి పట్టు కోగలిగాడు.

"మర్కటుల వెంట మౌగ్లీని చూశాను. మీకు తన జాడ చెప్పమన్నాడు. మర్కటులు నది దాటి, మర్కటనగరానికి అతన్ని తీసుకుపోయారు—శిథిలా లుండే చోటికి. రాత్రంతా గబ్బిలాయిలను చూస్తూండమని చెప్పాను. కింద ఉన్న మీ అందరికీ వేట బాగా సాగాలి. చీకటి పడుతున్నది, వస్తా," అన్నాడు డేగన్న.

"కడుపు నిండా తిండీ, కంటి నిండా నిద్రా కలగాలి, డేగన్నా! ఈసారి నేను

చంపే జంతువు తల పూర్తిగా నీకే వది లేస్తా!" అన్నాడు బాఘీర.

"నేను చేసిందాన్లో విశేష మేముంది? నా భాషలో పలకరించి పని చెప్పాడు. చెయ్యటం నా విధి," అంటూ డేగన్న రివ్వున పైకి లేచి, గుండ్రంగా తిరుగుతూ వెళ్ళిపోయాడు.

"సమయానికి పక్షిభాష జ్ఞాపకం పెట్టు కున్నాడు! వాడిది ఏం తెలివి!" అంటూ భాలూ గర్వంతో పొంగిపోయాడు.

"మొట్టికాయలతో తలలోకి ఇంకి ఉంటుందిలే. పదండి, మనం ఇప్పుడు శిథిలాల కేసి పోవాలి," అన్నాడు బాఘీర.

ఆ శిథిలాలు ఎక్కడ ఉండేదీ ముగ్గురికీ తెలుసు. "మేము నీ కోసం ఆగం. నేనూ, కావా వేగంగా పోతాం. నువు వెనకగా రా, భాలూ," అన్నాడు బాఘీర.

"కాళ్ళుండనీ, లేకపోనీ, నేను నీ అంత వేగంగానూ కదలగలను," అన్నాడు కావా.

భాలూ గబగబా నాలుగడుగులు వేసి, రొప్పు వచ్చి, చతికిల బడ్డాడు. మిగిలిన ఇద్దరూ వేగంగా ముందుకు సాగారు. బాఘీర ఎంత వేగంగా దూకుతూ పరిగెత్తినా కావా అతనితో సమంగా పాకగలిగాడు. దారిలో ఒక చిన్న వాగు వచ్చినప్పుడు బాఘీర దాని మీదిగా దూకేశాడు. కావా ఈదవలసి రావడంచేత కాస్త వెనకపడ్డాడు.

"ఏమిటో అనుకున్నాను, కావా! నీది యమవేగమే!" అన్నాడు బాఘీర.

"ఆకలి మీద ఉన్నాలే. నన్ను చుక్కల కప్పని అన్నారు కదూ?" అన్నాడు కావా.

"చుక్కల కప్ప కాదు. పచ్చ పురుగు!" అన్నాడు బాఘీర.

"ఏదైనా ఒకటే! పద, పద!"

కావా కళ్ళు నిశ్చలంగా దారి మీదనే ఉన్నాయి. అతని శరీరం దారి వెంట పాదరసం లాగా ప్రవహిస్తూ అతి వేగంగా ముందుకు పోతున్నది.



# 72. ఓల్డువాయ్ కనుమ

**తూ**ర్పు ఆఫ్రికాలోని టాంజానియా దేశంలో ఓల్డువాయ్ కనుమ ఉన్నది. ఇక్కడ జరిగిన పురాతత్వ పరిశోధనలలో 20 లక్షల ఏళ్ళ క్రితం నివసించిన మానవుడి అవశేషాలూ, అతను ఉపయోగించిన రాతిపనిముట్లూ దొరికాయి. ఈ కనుమలో 100, 200 ఏళ్ళపాటు పరిశోధనలు సాగవచ్చునట.



Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒకే బాట మాది

పంపినవారు :
కె. ఉషారాణి, సంగారెడ్డి

Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒకే పాట మాది

పంపినవారు:
కె. ఉషారాణి, సంగారెడ్డి

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 జనవరి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒకే బాట మాది

రెండవ ఫోటో : ఒకే పాట మాది

పంపినవారు : కె. ఉషారాణి,

C/o శ్రీ కె. సుబ్బారావు, (ఓవర్‌సీర్) సంగారెడ్డి.

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

గుండె
జలుబును
వెంటనే
పోగొట్టుకోండి!

# అమృతాంజనం

## పైనేరాసి త్వరగా గుణాన్ని పొందండి

అమృతాంజన్ బాధా నివారిణి నిరపాయకరంగా శీఘ్రంగా గుండె జలుబుకీ సాధారణ జలుబులకు అమోఘంగా గుణాన్ని కల్గించడానికి 10 రకాల ఔషధాలు చేరిన మందు. కండనొప్పులకు, తలనొప్పికి, బెణుకులకు కూడా అమృతాంజన్ అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా నెలల తరబడి వస్తుంది మీ కుటుంబానికంతా. అవసరానికెప్పుడూ అందు బాటుగా అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధి పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ <u>నొప్పుల జలుబుల</u> నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు




అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ


అబ్బాయిలూ, చిఱుబుఱు తాతను ఓమారు చూచి వద్దాం పదండి.
ఆ కోపిష్టి తాతేనా? ఎందుకేంటి, మళ్లీ మనల్ని తరిమి కొట్టాడు.
మరోమారు పోయివద్దాం పదండి-పాపం, ఒంటరిగా వుంటాడు.
హడావిడిగా వున్నాడేమో చూద్దాం-కిటికీలోంచే తొంగిచూద్దాం.
అబ్బ, కటిక చీకటిరా- దిలీప్, నీ టార్చి యిలా చూపించు- నా కాలికి ఏదో తగిలింది.
వహ్వా-లాకెట్టురా- తాతదే అయివుండొచ్చు. అడుగుదాం పదండి.
కుర్రకుంకల్లారా, ఇలా వచ్చి నన్ను అల్లరి పెట్టొద్దని చెప్పేనా?
తాతా, మేం వచ్చింది...
పొండి ఇక్కడ్నించి- నాకు చాలా పనివుంది.
దిలీప్ బృందం తాతకు చేసిన మేలు
తాతా, ఇది ఏదా? మీ పెరట్లో దొరికింది...
అవునర్రా- ఈ లాకెట్ నాదే!
పిల్లలూ ఇంట్లోకి రండి- మీ మేలు మరి జన్మలో మర్చిపోను...
అలా అనకు తాతా. మీకు సేవచేసినందుకు ఎంతో ఆనందంగావుంది.
ఈ ఉపకారమంతా 'ఎవరెడి' టార్చిదే!

# గోపాలుని రహస్యం


























## జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ



ఇప్పుడు ప్రదర్శింపబడుతూంది!

విజయా ఇంటర్‌నేషనల్ (మద్రాసు) వారి

# రామ్ ఔర్ శ్యామ్

దిలిప్‌కుమార్

వహీదా

ముంతాజ్

ప్రాణ్

నిరుపరాయ్

నిర్మాత : నాగిరెడ్డి

మ్యూజిక్ : నౌషాద్

డైరెక్షన్ : చాణక్య

# క్యాడ్‌బరిస్ అద్భుతలోకం నం 4

ఆస్ట్రేలియాలో నివసించే ప్లాటిపస్ ఒక జంతువే అయినా, అది ఒక పక్షివలె గ్రుడ్లు పెట్టుతుంది! అంతేకాదు. బాతుముక్కు వంటి ముక్కు, ఈదడానికి సహాయంగా బాతుకాళ్ళవలె వ్రేళ్ళ మధ్య చర్మమున్న నాలుగు కాళ్లకూడా ఉన్నాయి! బహుశా, ఇది జంతువులన్ని కలియగలిసి జీవిస్తుండిన ఐతిహాస యుగానికి పూర్వమునుండి మిగిలిపోయియుండవచ్చు!





ఈ జాతి స్తంభాలు ఐర్లండ్‌లో ప్రసిద్ధిగాంచిన జైయంట్స్ కాజ్‌వే అనబడేవి. ఇది ఫిన్ మెక్కూల్ అనే రాక్షసుడు స్కాట్లండ్‌లోని స్టాఫా ద్వీపానికి సముద్రం మీద దాటి వెళ్ళడానికి నిర్మించిన సేతువు అని ప్రతీతి. వాస్తవానికి, ఇవి ఆకస్మికంగా గడ్డకట్టిన బాసాల్టు రాళ్ల. స్తంభాలు 18 మీటర్ల వరకు లేచి, ఐదారు ప్రక్కలు గలిగియుంటాయి.

మాన్చెస్టరులో, పడవలు ఇతర పడవల మీదుగ ప్రయాణం చేస్తాయి, ఎలాగంటే, బార్టన్ ఆక్విడక్ట్ (జలవాహిక) బ్రిడ్జ్ వాటర్ కెనాల్‌ను మాన్చెస్టర్ షిప్ కెనాల్ మీదుగా తీసికొనిపోతుంది. షిప్ కెనాల్ ద్వారా పెద్ద పెద్ద ఓడలు వెళ్లుతున్నప్పుడు, 72 మీటర్ల పొడవుగల జలవాహిక ఓడలదారినుండి తప్పుకుంటుంది!





మీకు తెలుసా...
పాలు, ప్రోటీనులు, విటమినులు, ఖనిజాలు ఇస్తుందని? పాలు ప్రకృతినుండి లభించే పుష్టికరమైన సంపూర్ణాహారాలలో ఒకటని? క్యాడ్‌బరిస్ మిల్క్ చాకొలేటు ప్రతి తునకలో పాలయొక్క శ్రేష్ఠతంతా కూర్చబడిందని?




## మాధుర్య జీవితానికి క్యాడ్‌బరిస్

# ఫోస్ఫోమిన్



శక్తిని పెంపొందించును.



ఆకలిని అధికము చేయును.

సహనశక్తిని హెచ్చించును.



శరీరముయొక్క

రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

అవును —

కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్
వల్ల ఆరోగ్యము కలుగును.

ఫోస్ఫోమిన్...బి కాంప్లెక్స్ విటమినులు మల్టిపల్
గ్లిసరోఫోస్ఫేట్లుగల ఆకుపచ్చని పండ్ల రుచిగల టానిక్




SQUIBB®

SARABHAI CHEMICALS

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కుకు చిహ్నం: దీని లైసెన్సు
ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్

Shilpi SC 50 A /67 Tel

